# శ్రీ భోగాది దుర్గాప్రసాద్ స్మారక సమితి (రి)

మాన్యశ్రీ భోగాది దుర్గాప్రసాద్ హిందూసమాజ సంఘటనా కార్యంలో సంపూర్ణ సమయ కార్యకర్తగా ఎంతో మందిని ఈ పవిత్ర కార్యంలో భాగస్వాములను చేసారు. దురదృష్టవశాత్తు 1971లో తుపాకి కాల్పులకు గురై స్వర్గస్తులయ్యారు. వారి ఆశయాదర్శాలను, ఆకాంక్షలను సాకారం చేసే ప్రయత్నంలో భాగంగానే వారి పేరిట స్థాపించబడిన ఈ స్మారక సమితి వివిధ సేవా కార్యక్రమాలను నిర్వహించడంతో పాటు, విద్యార్థి విస్తారకులకు ఉపకారవేతనాలు ఇవ్వటం, అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ వారితో కలిసి శ్రీ సరస్వతీ అవార్డులను బహుకరించటం మొదలైన కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. గత మూడు సంవత్సరాలుగా కుటుంబ సమ్మేళనాలు నిర్వహించి ఆదర్శ కుటుంబ వ్యవస్థ ఆవిర్భావం కోసం కృషి చేస్తోంది. ఎందుకంటే సువ్యవస్థిత హిందూ సమాజానికి ఆధారం కుటుంబ వ్యవస్థే కనుక. హిందూ జీవన విధానానికి ఆధారభూతమే కాక, ప్రాథమిక విద్యాభ్యాసన కేంద్రం కూడా కుటుంబమే. తరతరాల వారసత్వాన్ని, ఆచార వ్యవహారాలను, సంస్కృతి సంప్రదాయాలను పరిరక్షిస్తూ రాబోయే తరాలకు వాటిని అందించే సజీవ స్ఫూర్తి కేంద్రం కూడా కుటుంబమే. ఈ కుటుంబ వ్యవస్థ సక్రమంగా ఉన్నప్పుడే, నాడు మన ఆర్యులు ఆశించిన 'వసుధైక కుటుంబక' స్థితికి మనం చేరుకోగలం. దురదృష్టవశాత్తు సమాజంలో నేడు చాలా మందికి ఈ హిందూ కుటుంబ వ్యవస్థ గురించి సరియైన అవగాహన లేకపోవటమే కాక, కొన్ని అపోహలు, దురభిప్రాయాలు కూడా ఉన్నాయి. దీనికితోడు పాశ్చాత్య సాంస్కృతిక దురాక్రమణకు మన సమాజం గురి అవటం. సువ్యవస్థిత హిందూ సమాజ నిర్మాణం నేటి తక్షణావసరంగా గుర్తించటంతో పాటు దానికి ఆధారభూతమైన హిందూ కుటుంబ వ్యవస్థ గురించి సరియైన అవగాహన కల్పించి, అపోహలు దూరం చేయాలనే ఉద్దేశ్యంతో ఈ పుస్తకాన్ని స్మారక సమితి తరపున ప్రచురించటమే కాకుండా, అందరికి అందుబాటులో వుండే విధంగా కేవలం 5/- రూపాయలకే ఇవ్వ సంకల్పించింది. పాఠకులు ఆదరించి, ఇందులోని విషయాలు ఆచరించి మమ్మల్ని ప్రోత్సాహిస్తారని ఆశిస్తున్నాము.

# కుటుంబ వ్యవస్థ అవసరమా?

భారతీయ సంస్కృతీ ప్రచారసమితి
ప్రథమ పుష్పం

హిందీ మూలం
శ్రీరాం సాఠే
సుశీలా అభ్యంకర్
శకుంతలాదవే

తెలుగు అనువాదం :
శ్యాంప్రకాశ్

సేవికా ప్రచురణ - ఆంధ్రప్రదేశ్

భారతీయ సంస్కృతీ ప్రచార సమితి
ప్రథమ పుష్పం

**మొదటి ముద్రణ :**
సంక్రాంతి, శాలివాహనశక - 1918
14-1-1997

**ద్వితీయ ముద్రణ :**
ఈశ్వరనామ సంవత్సర ఉగాది
శాలివాహనశక - 1919

**ప్రచురణ :**
సేవికా ప్రకాశన్, ఆంధ్రప్రదేశ్
సరస్వతీ, ప్లాట్ నెం. 3,
3-4-12, నిర్మిత్‌నికేతన్,
కాచిగూడ, హైద్రాబాద్ - 500 027.

**ప్రతులకు :**
సాహిత్యనికేతన్, కేశవనిలయం,
బర్కత్‌పురా, హైద్రాబాద్ - 500 027.
ఫోన్ : 7603236.

శ్రీ భోగాది దుర్గాప్రసాద్ స్మారక సమితి వారి ఆర్థిక సహాయంతో తగ్గింపు ధరలో ప్రచురించబడినది.

**తగ్గింపు ధర రూ. 5-00**

# మనవి

'భారతీయ సంస్కృతి ప్రచారసమితి' కోసం డా॥ శకుంతలాదవేగారు వ్రాసిన ''చిరంతన భారతీయ సంస్కృతికే ఆధార్'' అనే పుస్తకాన్ని మేం రెండున్నర నెలల క్రితం ప్రచురించాము. సమితి అనుమతితో ఈ తెలుగు అనువాద పుస్తకాన్ని సమితి రెండవ పుస్తకంగా ఇప్పుడు ప్రచురించటానికి నిశ్చయించాము. ముగ్గురు పండితుల ద్వారా ఈ పుస్తకం సంకలనం చేయబడింది.

శ్రీ రాంసారేగారు ఇంగ్లీషు హిందీల్లో వ్రాసిన చాలా పుస్తకాలు ప్రచురించబడ్డాయి. *7,8* పుస్తకాలు *6,7* ఇతర భారతీయ భాషల్లోకి అనువదించబడ్డాయి కూడా. చాలామంది విదేశీ రచయితలు, వారి పుస్తకాల్లో పేర్కొన్న విషయాలను తమరచనల్లో ఉపయోగించుకున్నారు.

శ్రీమతి సుశీల అభయంకర్‌గారు వ్రాసిన మరాఠీ పుస్తకం ఆధారంగా వ్రాయబడిన 'వందేమాతరం' అనే పుస్తకం *1994*లో మేం ప్రచురించాము. మరాఠీలో వారు వ్రాసిన వ్యాసాలు చాలా ముద్రితమైనాయి. మహారాష్ట్ర ప్రభుత్వం ద్వారా వారు సన్మానించబడ్డారు. రాష్ట్ర సేవికాసమితికి వారు అఖిల భారతీయ బౌద్ధిక ప్రముఖ్‌గావున్నారు.

భారతీయ సంస్కృతి యొక్క మనన, చింతన, వ్యక్తీకరణ ఈ మూడు విషయాల్లో శకుంతలాదవేగారు ప్రత్యేకంగా చెప్పుకోదగినవారు. హైద్రాబాదులోని ఆయుర్వేద కళాశాలలో వారు సహాచార్యులుగావున్నారు. రా. సే. సమితి భాగ్యనగర్‌శాఖకు వారు బౌద్ధిక ప్రముఖులు.

భారతీయ కుటుంబ వ్యవస్థపై ఈనాడు ప్రపంచంలో చర్చ జరుగుతున్నది. ఈ దృష్టితో ఉపయోగపడుతుందనే ఉద్దేశంతో మేమీ పుస్తకాన్ని ప్రచురిస్తున్నాము.

దీని తెల్గు అనువాదం శ్యాం ప్రకాశ్‌గారు చేసారు. ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డిగారు ప్రస్తావన వ్రాశారు. వారికి, ఇంకా దీని ప్రచురణకు తోడ్పడిన అనేకమంది ఇతరులకు మా కృతజ్ఞతలు.

ఇట్లు

**ప్రకాశకులు**

ముందుమాట

# కుటుంబంలోకి ప్రవేశద్వారం

''అత్తలేని కోడలుత్తమురాలు - కోడలులేని అత్త గుణవంతురాలు'' అనేసామెతలు సమాజంలో వింటుంటాం. అంటే అత్తాకోడండ్రు ఇద్దరూ కలిసి ఉంటే కలహించుకొంటారనీ, వీరిద్దరు వేర్వేరుగా ఉంటేనే మంచి పేరువస్తుందని పై సామెతల సారాంశం. ''ముప్పయి జుట్లు కలిసి ఉంటాయిగాని మూడు సిగలు కలిసి ఉండ''వని ఆడవారిమీద ఒక అభాండం. అందుకే ''వెయ్యేళ్లున్నా వేరుతప్పదు'' - ఎప్పుడో ఓసారి వేరుకావడమే ఉత్తమం అని మరో సామెత.

ఈ సామెతలన్నీ సత్యాలే ! సమిష్టి కుటుంబంలో వచ్చే అనేక సమస్యల్ని పరిష్కరించుకోలేనందువల్ల పుట్టిన సామెతలే ఇవి. ''ఇంటిని దీపం ఇల్లాలే, తల్లికడుపుచూస్తుంది. పెళ్లాం జేబులు చూస్తుంది, ఇంటికళ ఇల్లాలే చెబుతుంది, ఇంటి కోడళ్లుతిన్నా - కోళ్లుతిన్నా వృథాగాపోదు, ఆలు ఏడ్చిన ఇల్లు - ఎద్దు ఏడ్చిన సేద్యం ముందుకురావు, ఆలు మగల కలహం అద్దంమీద పెసరిగించ ఉన్నంతసేపే''.... ఈ సామెతలేవో సమష్టికుటుంబం ఔన్నత్యాన్ని చెబుతున్నాయి. ప్రపంచానికి భారతీయులు పెట్టిన భిక్షకుటుంబ జీవనం. పాశ్చాత్య ప్రభంజనాల ధాటికి భారతీయ కుటుంబ జీవన వ్యవస్థ ఛిన్నా భిన్నమైపోతుందని నగర జీవనాన్ని అధ్యయనం చేసినవారంటుంటారు. అత్త-ఆడపడుచులపెత్తనాల వల్ల, పురుషాహంకారంవల్ల కుటుంబవిచ్ఛిత్తి ఏర్పడుతున్నదని అక్కడక్కడ కొన్ని కుటుంబాలను అధ్యయనం చేసిన వారంటుంటారు. కుటుంబాల్లోని వ్యక్తుల్లో అధికారదాహం, విలాస జీవనంపైమోజు - ఇలాంటి కొన్ని కారణాల వల్ల సమిష్టి కుటుంబాలు సుదీర్ఘకాలం ఉండలేకపోతున్నాయని మరికొంత మంది అధ్యయన శీలురంటుంటారు.

ఇవన్నీ సత్యాలే? ఇవన్నీ సత్యాలెట్లో ఈనాటికీ భారతదేశంలో 95% జనం కుటుంబ వ్యవస్థలోనే ఉన్నారన్నది అంతే సత్యం. ఈ 95% కుటుంబాలు సుదీర్ఘకాలంపాటు సమిష్టిగా లేకపోచ్చు; కాని కొడుకులూ - కూతుళ్లూ సంపాదనాపరులై, వ్యక్తిత్వం వచ్చికాలు నిలదొక్కుకొనేంత స్తోమత కలిగేంత వరకైనా ఉంటున్నారనేది మాత్రం సత్యం. ఈ తొంబై అయిదు శాతం సుఖశాంతులతో ఉన్నారని అనడంలేదు. ఇందులో సగానికిపైచిలుకు అష్టకష్టాలు పడుతూనే కలిసి ఉంటారు. కలిసి ఉంటే కలదు సుఖం'' - అని తెలిసిన వారు కాబట్టి కలిసి ఉంటున్నారు. కలతలూ - కలహాలు నీటి బుడగల్లాంటివని తెలిసి కలిసి మెలిసి జీవిస్తున్నారు.

రెక్కలు వచ్చేంత వరకు పక్షులూ - జంతువులు తమ సంతానంతో కలిసి ఉండడం చూస్తుంటాం. పిల్లి, కుక్క, కోతి, పంది, పిట్ట, ఆవు, కోడి - ఇలా ఎన్నో కొంతకాలంపాటైనా తమ సంతానంతో కలిసి ఉంటున్నాయి. ఆహారం తెచ్చిపెట్టి తమ సంతానాన్ని మరీ పోషిస్తున్నాయి. కుక్కపిల్ల బురదలో పడిపడి వస్తే కుక్క నాకి నాకి ఆ బురదను తొలగించే దృశ్యం ఆవు లేగదూడ శరీరాన్ని ఆప్యాయంగా నాకేదృశ్యం ఎవరమూ మరువలేం. ఆహార నిద్రాభయమైథునాలు సర్వజీవులకూ సమానమే. వీటి కారణంగా కూడా సామూహిక జీవనానికి సర్వజీవులూ ప్రయత్నిస్తున్నాయి. మానవునికి వీటితోపాటు ధర్మమనేది ఒకటున్నది. అది కుటుంబీకులుగా, సామాజికులుగా, ప్రాంతీయులుగా, దేశీయులుగా కలిసి జీవించేందుకు దోహదకారి అవుతున్నది.

ఈ కుటుంబజీవనం ఈ దేశంలో అతి ప్రాచీనకాలం నుండి ఉన్నది. ఒకరికి ఒకేభార్య, ఒకరికి పెక్కురు భార్యలు, ఒకరికి ఒకే భర్త, ఒకరికి పెక్కులు భర్తలు - ఆయా దేశకాల పరిస్థితుల్లో ఏర్పడ్డవే అయినా పెక్కురను కుటుంబ (గృహ్య) ధర్మసూత్రాలు అంగీకరించలేదు. కొన్ని, తప్పనిసరి పరిస్థితుల్లో అంగీకరించాయేగాని అవి శాశ్వతాచరణీయాలు కావు; సార్వకాలీన - సార్వదేశిక

- సార్వజనీన సిద్ధాంతాలు కావు. ఒకరికి ఒక్కరన్నదే ఆచరణీయమైంది. సమాదరణీయమైంది. పాశ్చాత్య సంస్కృతి ప్రపంచానికి తెచ్చిపెట్టిన భయంకర ఎయిడ్స్‌రోగం దెబ్బకు ఇవాళ సెక్సులో స్వేచ్ఛావాదులు, పతివ్రతాత్వం మూఢవిశ్వాసాల్లో ఒకటని వాదించిన కమ్యూనిస్టులు, పెట్టుబడిదారీ దేశాల స్త్రీవాదులు, సామ్యవాద దేశాల స్త్రీవాదులు నోళ్లు మూసుకొన్నారు. ఆంధ్ర దేశంలో ''మైదాన'' సాహిత్యాన్ని సమర్థించిన వారందరూ కుక్కిన పేనులై పోయారు.

అందుకే మేధావులందరూ భారతీయుల వసుధైక కుటుంబ నినాదాన్ని ఈనాడు సమర్థిస్తున్నారు. వ్యక్తిహితం, కుటుంబ హితం, సమాజహితం, దేశహితం, విశ్వహితం అనే ఈ అవిభాజ్య ధర్మచక్రాన్ని ఇవాళ అందరూ అభిలషిస్తున్నారు. ఆచరణలో పెట్టే ప్రయత్నంచేస్తున్నారు.




వీటన్నిటిలో ధర్మం అంతస్సూత్రంగా ఉంది. అదే ఇవి చెదరకుండా చేస్తుంది. క్లబ్బే కుటుంబంగా భావించే పెట్టుబడిదారీ సమాజాలు, యంత్రమే కుటుంబంగా భావించే సామ్యవాద సమాజాలు, ఒక్కమత గ్రంథాన్నే సర్వస్వంగా భావించే మతవాద సమాజాలు ఇప్పుడిప్పుడే పై అవిభాజ్య కుటుంబ ధర్మచక్రాన్ని అంగీకరిస్తున్నాయి. మనిషిని మనిషిగా చూడమన్న ''మనుర్భవ'' అన్న

(మనిషివికమ్మ అన్న) వేదవాక్యాన్ని సమర్థిస్తున్నాయి. మనిషి మనిషికాక శిల అయితే, నది అయితే, మృగమైతేనే కష్టాలు. అరవిందులు ఈ మానవుడు దివ్యమానవుడు కావాలని ఆశించారు. ఊర్ధ్వగమనం ఉండాలిగాని, అథఃపతనంకాదు అన్నది వారి ఆకాంక్ష ఇందుకు సాధన, సంస్కారం, ధ్యానం, ధర్మం అన్నీ అవసరం.

అయితే ఇన్ని మహదాకాంక్షల్ని భారతీయ కుటుంబం తీరుస్తున్నదా! భౌతికావసరాల వెంపర్లాటలో మానసిక వికారాలు ఎంతోచెడును సృష్టించాయి. ఆచెడు కుటుంబ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయకపోయినా కొంత అశాంతిని సృష్టించిన మాట వాస్తవం. పాశ్చాత్యుల ఆలోచనల్లోంచి వచ్చిన వ్యక్తి, ఒడంబడిక, సమూహం, కాంక్షాపరితృప్తి అనేవి నాటుకొని ఎవరికి వారే అంతా అర్థం చుట్టూ అవసరాలచుట్టూ పరిభ్రమించే వారుగా తయారయ్యారు. ఓ ప్లాటుఫాం స్నేహంలాంటిది, అవసరం ఉన్నంత వరకు కలిసి ఉంటాం, అవసరంతీరిందా ఎవరికి వారుగా వెళ్ళిపోతాం అనే పశుప్రాయజీవనం సరియైందికాదని, అవసరాల వేటలో మానవుడు మృగంగా మారిపోతాడని మేధావులు గుర్తించారు.




ఇది పాశ్చాత్య జీవన దృక్పథం అవసరాలు తీరడానికి తప్ప మరెందుకూ పనికిరాని ఈ జీవన దృక్పథంలోని లోపాన్ని ఇవాళ అందరూ గుర్తించి, భారతీయ కుటుంబ దృక్పథాన్నే అనుసరించడం అభినందనీయం. అయితే ఈ వ్యవస్థలోనూ కొన్నిలోపాలున్నాయి. అందులో ఒకటి వ్యక్తి అధికార దృక్పథం.




కుటుంబంలో పెత్తనం చలాయించే వ్యక్తికి అధికారదాహంవుంటే భార్యపై, కొడుకులపై, కోడండ్రపై, అల్లుండ్రపై, బంధువులపై, ఇంటిలోని పెంపుడు జంతువులపై అణచివేత దృష్టితో వ్యవహరిస్తాడు. అన్ని అధికారాలు తన గుప్పిట్లో పెట్టుకొంటాడు. అందరిస్వాతంత్ర్యాన్ని హరిస్తాడు. నిద్రపోయినా, మరుగుదొడ్డికి వెళ్లినా తాళం చెవులగుత్తి మాత్రం నడుముకే వ్రేలాడుతుంది. చివరికి అందరిదృష్టి తాళాల గుత్తిచుట్టే కేంద్రీకృతమవుతుంది. అధికారం కేంద్రీకృతమై సర్వానర్థాలకు దారి తీస్తుంది. అయితే యజమానికి సమదృష్టి ఉంటే, నేను కేవలం ట్రస్టీని ( ధర్మకర్తను) మాత్రమే అన్న జ్ఞానం ఉంటే అడుగడుగునా అనురాగాలు క్రుమ్మరింపబడతాయి; ఆనందాలు వెల్లివిరుస్తాయి. ఇక మరొకటి చూద్దాం; అది దీనికి పూర్తిగా భిన్నమైంది. అది వ్యక్తి అణచివేత దృక్పథం.



కుటుంబంలో ఒక వ్యక్తి యజమాని అవుతాడు; అతనే ఇంటిపెద్ద. అతను అధికారాన్ని చలాయించడం. కుటుంబ బండిని చాలా కష్టంగా నెట్టుకొస్తుంటాడు. కుటుంబంలోని సభ్యులందరు అతని ఒక్కని ఆదాయం మీదనే ఆధారపడి ఉంటారు. తమ అవసరాలన్నీ అతడే తీర్చాలంటారు. నా జబ్బుకు మందులు కావాలని తల్లి, తన చుట్టకు డబ్బుకావాలని తండ్రి, చదువులకు ఫీజులు కావాలని కొడుకులు ఇలా ప్రతి ఒక్కరు అతనిపైనే కారాలు మిరియాలు మారుతుంటారు. అతణ్ణి శారీరకంగా – మానసికంగా హింసిస్తారు. ' ఈ చేతగాని సంసారం చేయకపోతే చావు' అనికూడా శాపనార్థాలు పెడతారు. ఇంతమంది బరువుకు పెత్తనం స్వీకరించిన ఆ యజమాని అణగిపోతాడు; అడుగువట్టిపోతాడు. కావి కుటుంబ నిర్వహణలో అందరికీ సమష్టి బాధ్యత ఉందని భావిస్తే ఇలా జరగదు.

కుటుంబం అనేది ఒక శరీరం; ఈ శరీరంలోని సర్వాంగాలు తమ తమ బాధ్యతను నిర్వర్తించినట్లే ఎవరిబాధ్యతను వారు నిర్వర్తిస్తే శరీరమనే కుటుంబం వికసిస్తుంది. వేదంలోని ''మనుర్భవ అన్న మంత్రం వెనుక ఇదే అర్థం ఉంది. సమాజ ఒడంబడికకు, సామూహిక జీవనపద్ధతికి, అధికార కేంద్రీకరణ విధానానికి, అణచివేత పద్ధతికి, క్లబ్బు జీవనరీతికి, యంత్ర జీవన పద్ధతికి ఇది భిన్నమైంది. ఇది సర్వజనామోద యోగ్యమైంది. వ్యక్తి శరీరంలోని కళ్ళు, కన్ను, ముక్కు, చెవి, నోరు, చేతులు, కాళ్ళు, కడుపు, గుండె ఎలా ఎన్నో అవయవాలు తమ తమ పని నిర్వర్తిస్తూ శరీరపుష్టికి, వికాసానికి, భద్రతకు దోహదకారులుగా వ్యవహరిస్తాయి. అదేవిధంగా కుటుంబ వికాస దృష్టి ఉండాలనీ, సమాజవికాస దృష్టి ఉండాలనీ, దేశ వికాస దృష్టి ఉండాలని, విశ్వవికాస దృష్టి ఉండాలనీ ఆలోచించే సమస్తాన్ని మనిషితోనే ఉదహరించడం జరిగింది. తన శరీరం వికసించడానికి, మనస్సు పరమ శాంతంగా ఉండడానికి, భద్రత ఏర్పడడానికి సర్వాంగాలు ఏవిధంగా దోహదం చేశాయో, అదే దృష్టి కుటుంబంపై, సమాజంపై, దేశంపై, విశ్వంపై ఉండాలని భారతీయతత్త్వం

లేదా భారతీయ ధర్మం అభిలాషించింది. వ్యష్టి - సమష్టి - సృష్టి- పరమేష్ఠి వైపుగా పయనించే పరమోత్తమ వ్యవస్థను నిర్మాణం చేసింది.

ఈ అంశాలనెన్నిటినో క్రోడీకరించి హిందీలో మాన్యశ్రీ శ్రీరాంసాఠేగారు, సోదరీమణులు శ్రీమతి సుశీలా అభయంకర్ గారు, శ్రీమతి శకుంతలా దవే గారు అందించిన గ్రంథాన్ని భారతీయకుటుంబం పేరిట సకారాత్మక దృష్టిని ప్రస్థాపిస్తూనే, మనల్ని చదివించాలనే ఉద్దేశ్యంతో ''కుటుంబ వ్యవస్థ అవసరమా''? అన్న జిజ్ఞాసనం రేకెత్తింపజేస్తూ అతి సరళంగా - సుందరంగా శ్రీ శ్యాం ప్రకాశ్‌గారు అనువదించారు. అనువాదంలో తెలుగు జీవనాటి (తెలుగుదనం) నిండారా కనిపించడంలేదే అనిపించవచ్చు. అయితే అర్థావగాహనకు ఇది ఎలాంటి అడ్డంకికాదు. పుస్తకం చిన్నదైనా అనేక విశేషాంశాలను జిజ్ఞాసువుల ముందుంచిన చిక్కి చక్కి ఈ చిన్ని పుస్తకాన్ని రచించిన హిందీ రచయిత (త్రు)లనూ, అనువాదకులనూ అభినందించకుండా ఉండలేం! ఈ దిశలో అధ్యయనం చేసే వారికి ఇది ప్రాథేయంగా ఉపయోగపడుతుందని చెప్పకుండా ఉండలేం! అంతా చదివింతర్వాత ''భారతీయ కుటుంబవ్యవస్థ'' సుఖశాంతి భద్రతలకు మూలాధారం అని నిర్ధారించకుండా ఉండలేం! ఆ ఉండలేని స్థితిలోనే ఈచిన్ని పీఠిక! ఇది భారతీయకుటుంబంలోకి ప్రవేశించడానికి ఓ ద్వారం మాత్రమే!

**డా॥ కసిరెడ్డి** (కార్యదర్శి)
జాతీయ సాహిత్య పరిషత్, ఆంధ్రప్రదేశ్

భాగ్యనగర్,
**1997** జనవరి **7**

# భారతీయ కుటుంబం

భారతదేశంలో గత యాభై, వంద సంవత్సరాలనుండి వృద్ధాశ్రమాల సంఖ్య పెరిగిపోతున్నది. చాలా జిల్లాల్లో ఇప్పుడు వృద్ధాశ్రమాలు నెలకొని వున్నాయి. ఇప్పటివరకు ఈవృద్ధులు తమ తమ కుటుంబాల్లోనే నివసిస్తూ తమ వృద్ధాప్యాన్ని గడుపుతుండేవారు. ఇప్పుడు వాళ్ళు తమ కుటుంబాల్లో నివసించటం కష్టమైపోయింది. భారతీయ కుటుంబ చరిత్ర వేదకాలం నుండి నేటివరకు నిరంతరం కొనసాగుతూ వస్తున్నది. అనేకవేల సంవత్సరాలు గడిచాయి. కాని ఇంతవరకెప్పుడు భారతదేశంలో వృద్ధులు తమ కుటుంబాలు వదిలి వృద్ధాశ్రమాల్లో ఉండాల్సిన అవసరం రాలేదు. ఈ వృద్ధాశ్రమ ఆలోచన భారతీయులు ఆంగ్లేయులనుండి గ్రహించారు.

గత రెండున్నరవేల సంవత్సరాలనుండి భారతదేశం మీద విదేశీయుల దురాక్రమణ జరుగుతూ వచ్చింది. కాని ఆంగ్లేయులకు పూర్వం జరిగిన ఏ విదేశీ ఆక్రమణకారుల ప్రభావం కూడా భారతీయ కుటుంబ వ్యవస్థను విచ్ఛిన్నం చేయలేదు. ఒక్క ఆంగ్లేయుల దురాక్రమణ వల్లనే ఇది జరిగింది. కేవలం వృద్ధాశ్రమాల సంఖ్యే కాక, విడాకుల సంఖ్య కూడా రోజురోజుకూ పెరుగుతున్నది. కుటుంబ సభ్యుల్లోకూడా స్వార్థం కొరకు, హక్కులకొరకు తగువులు, కొట్లాటలు పెరుగుతున్నాయి. భారతీయుల్లో శ్రీరామ, భరతుల్లాంటి సోదరభావం, పరస్పర వ్యవహారం దేశం మొత్తంలో తగ్గిపోతున్నది. ప్రేమ, సహృదయతలకు బదులు పగ, శతృత్వం పెరుగుతున్నాయి. ఆంగ్ల సంస్కృతితోపాటు మొత్తం పాశ్చాత్య సంస్కృతే భౌతికతకే ప్రాధాన్యమిచ్చింది. పైగా అది వ్యక్తి కేంద్రితమైంది. పాశ్చాత్య సంస్కృతి ప్రభావం కారణంగా భారతీయుల కుటుంబ వ్యవహారంలో పైన పేర్కొనబడిన మార్పులు వచ్చాయి. భారతీయ కుటుంబానికి సంబంధించి చర్చించే ఈ గ్రంథంలో పాశ్చాత్య సంస్కృతి ప్రభావానికిలోనైన ఈనాటి, ఇంతకు పూర్వకాలంనాటి భారతీయ కుటుంబం గురించి విశ్లేషించడం జరుగుతుంది.

భారతీయ కుటుంబం పెద్దగా వుండేది. ఈనాడు భారతదేశంలో కుటుంబం అనగానే ప్రభుత్వ కుటుంబ సంక్షేమశాఖల ద్వారా ప్రచురించబడే కరపత్రాల్లో కనబడే భార్య, భర్త, ఒక కుమారుడు, ఒక కుమార్తెగల చిన్న కుటుంబమే మన కళ్ళముందు కనపడుతుంది. 40 సంవత్సరాలకు పూర్వం కుటుంబసంక్షేమశాఖ కరపత్రాల్లో ఇద్దరికి బదులు ముగ్గురు పిల్లలు చూపబడుతుండేవాళ్ళు. ఈ రెండు చిత్రాలను చూసిన ఒక పెద్ద మనిషి తనతో సమానమైన వయస్సుగల వ్యక్తితో 'ఇంకో 40 సంవత్సరాల తర్వాత ఒక బిడ్డ బొమ్మనే చూపిస్తారా ఏమిటి అని అడిగాడు. 'ఒక బిడ్డయే కాదు, ఈనాడు భారతదేశంలో పెరుగుతున్న విడాకుల సంఖ్యను బట్టి చూస్తే, 40, 50 సంవత్సరాల తర్వాత కుటుంబ వ్యవస్థయే పూర్తిగా నాశనమైపోయి మనుష్యులు పశువులవలె జీవించడం మొదలుపెడతారనే అనుమానం కలుగుతున్నదని, అతడు సమాధానం ఇచ్చాడు.

50 సంవత్సరాలకు పూర్వం, భారతీయ సమాజంలో ధనికులు, పేదలు, చదువుకున్నవాళ్ళు, చదువురాని వాళ్ళు, గ్రామీణులు, పట్టణవాసులు అందరి దృష్టిలో కుటుంబం అంటే ''మేమిద్దరం, మాకిద్దరు'' అనే పరిమితార్థం ఉండేదికాదు. కుటుంబం అంటే తాతలు, ముత్తాతలు, అమ్మమ్మలు, జేజమ్మలు, నాయనమ్మలు, పినతండ్రులు, పినతల్లులు, అన్నలు, వదినెలు, అక్కచెల్లెళ్ళు, బావలు, ఇలా మొత్తం బంధువర్గంతో కూడిన కుటుంబం వాళ్ళ దృష్టికి వచ్చేది. ఇంత పెద్ద సంఖ్యగల కుటుంబాలతో కూడిన భారతీయ సమాజ జీవనం అనేక వేల సంవత్సరాలనుండి నిరంతరం కొనసాగుతూవచ్చింది. ఈ అనుభవాన్ని బట్టి ఇంత పెద్ద కుటుంబాలు, ఇంత దీర్ఘకాలం నిరంతరం కొనసాగ వానికవసరమైన భౌతిక సుఖ సాధనాలు భారతీయ సమాజంలో సమృద్ధిగా లభ్యమవుతుండేవని మనకు తెలుస్తుంది. కుటుంబాలు పెద్దగా వుండటంతోపాటు భౌతిక సుఖం, మనశ్శాంతి, సంతృప్తి అన్నీ సంపూర్ణంగా వుండేవి. ఈ పరిస్థితిని చూసి చాలమంది పాశ్చాత్య విద్వాంసులు భారతీయ

కుటుంబాలను గురించి పరిశోధనలు జరిపి భారతీయుల సుఖ సంతోష మనశ్శాంతులతో కూడిన సుదీర్ఘ జీవనానికి కారణం ఏమైవుంటుందో తెల్సుకోటానికి కృషిచేస్తున్నారు.

కుటుంబం చిన్నదిగా ఉంటే సుఖం ఉంటుందా: 'మేమిద్దరం, మాకిద్దరు' అనే ప్రకటనలో చిన్న కుటుంబం, చింతలులేని కుటుంబం' అని కూడా రాసి వుంటుంది. ఆర్థిక సౌకర్యం ఆలోచనే ఇందులోవుంది. 'కుటుంబం చిన్నదిగా వుంటే దాని రక్షణ, పోషణకు ఖర్చు తక్కువ పడుతుంది; దానితో కుటుంబం సుఖంగా వుంటుంది' అని ప్రచారం చేయబడుతున్నది. కాని ఇది నిజమేనా? అమెరికాలో డబ్బుకు ధాన్యానికి కొదువలేదు. ధాన్యం ధర తగ్గకుండా వుండాలని అక్కడ ధాన్యం కాల్చివేయబడుతుందని 1996లో జరిగిన విశ్వ ఆహార పరిషత్‌లో ప్రకటించబడింది. అంత భౌతిక సమృద్ధి వున్నప్పటికి అక్కడి వ్యక్తి సుఖశాంతులు ఎందుకు పొందలేక పోతున్నాడు? కేవలం భౌతిక, ఆర్థిక లేక ఐహిక సుఖశాంతులతో మాత్రమే వ్యక్తికి మనశ్శాంతి లభించదని దీనవల్ల తెలుస్తుంది. చిన్న కుటుంబం వున్నంతమాత్రంతోనే సుఖం లభిస్తుందని అనుకోవటం పొరబాటు. భారతదేశంలోకూడా భోగాసక్తులైన వ్యక్తులకు వాళ్ళు రాజులైనా వాళ్ళకు మనశ్శాంతి లభించేదికాదు. ఆర్థికంగా సుసంపన్నులుకాని భారతీయ వ్యక్తుల కుటుంబాల సుఖజీవనాన్ని చూచే పాశ్చాత్యులు భారతీయ కుటుంబసమాజవ్యవస్థను గురించి పరిశోధన చేయాలని కోరుతున్నారు. సమస్త సుఖాలతో తులతూగే అమెరికన్ ప్రజల్లో ఎందరో నిద్రరావటానికి నిద్రమాత్రలు వాడతారు. భారతదేశంలో రిక్షాలాగే వ్యక్తులు కూడా రాయిమీద తలపెట్టుకుని మంచి నిద్రపోతారు. భారతదేశంలో కూడా పాశ్చాత్య జీవన పద్ధతిని అవలంబించే భారతీయ వ్యక్తులు మనశ్శాంతిని సంస్కారాలను కోల్పోతున్నారు.

# ప్రభుత్వమే సర్వస్వమా?

ఆంగ్ల ప్రభుత్వం భా-రతదేశంలో స్థిరపడినప్పటినుండి అంటే గత నూరు, నూటయాభై సంవత్సరాల నుండి సమాజ జీవితంలో ప్రభుత్వమే సర్వస్వమని భావించబడింది. పాశ్చాత్య ఆలోచనా ప్రభావం భారతీయుల మనస్సులమీద రోజురోజుకు ఎక్కువైపోయింది. ఆంగ్లేయులు మొదటి 75 సంవత్సరాలు తమ స్వార్థం కోసం, తర్వాత ప్రభుత్వమే సర్వస్వమనే వాళ్ళ ఆలోచనా పద్ధతి ప్రకారం ఇక్కడ రాజ్యం చేస్తూ సమాజంలోని వీలైనన్ని ఎక్కువ రంగాలను తమ గుప్పిట్లోకి తెచ్చుకోటానికి ప్రయత్నం చేశారు. సమాజ జీవనం మీద ప్రభుత్వానికి అదుపులేని అధికారం వుండటం మంచిదికాదనే విషయాన్ని భారతీయులు చాలా ప్రాచీన కాలంలోనే గ్రహించారు. అనేక వేల సంవత్సరాల తమ సమాజ జీవనంలో భారతీయులెప్పుడూ తమ సామాజిక జీవనం మీద ప్రభుత్వ సర్వాధికారానికి అంగీకరించలేదు. సమాజంలోని చాలా కొద్దిరంగాలు మాత్రమే ప్రభుత్వాధీనంలో వుండేవి. మిగిలిన అన్ని రంగాలు, మేధావులు, బుద్ధిమంతులు, నిస్వార్థపరులునైన సమాజ సేవకులు, నాయకులతో పాటు, వారి వారి సంఘటనల ద్వారా మిక్కిలి సమర్థవంతంగా నిర్వహించబడుతుండేవి. ఇలాంటి నిస్వార్థ సద్గుణ సంపన్నులైన వ్యక్తులే సమాజానికి ఆదర్శప్రాయంగా వుండేవాళ్ళు. ఇలాంటి సద్గుణాలు గల్గిన మన మునులు, ఋషులు, మొత్తం భారతీయ సమాజ కల్యాణమేకాక విశ్వకల్యాణాన్ని కూడా తమ లక్ష్యంగా భావించి పనిచేసేవారు. ప్రభుత్వాలు నడిపే రాజులు కూడా ఋషి మునుల మార్గదర్శనంలోనే పనిచేసేవాళ్ళు. అనేక వేల సంవత్సరాలు నడిచిన భారతీయుల స్వ-తంత్రం ఇలావుండేది. 1947లో ఆంగ్లేయులు భారతదేశాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయారు. కాని వెళ్ళిపోయే సమయంలో ఖండిత భారతదేశ రాజ్యాధికారాన్ని ఎవరికైతే ఒప్పగించి వెళ్ళారో వాళ్ళు ఆంగ్లాన్ని, ఆంగ్లత్వాన్ని విడిచిపెట్టలేదు. 1947లో స్వతంత్రం లభించిన తర్వాత నుండి ఈనాటి వరకు సమాజంలోని వీలైనన్ని ఎక్కువ రంగాలను ప్రభుత్వం తన గుప్పిట్లోకి

తెచ్చుకుంటున్నది. అదే విధంగా భోగ ప్రధానమైన పాశ్చాత్య సంస్కృతి ప్రభావం కూడా చాలా ఎక్కువైంది. భారతీయుల జీవితంలో వీలైనంత ఎక్కువ వ్యక్తి నిష్ఠ భోగలాలసతలు పెరిగాయి. దాని ఫలితంగా భారతీయ స్వాతంత్ర్యానికి మూలాధారమైన కుటుంబ ఆలోచన సన్నగిల్లి పాశ్చాత్య ఆలోచనచే ప్రభావితమైన కుటుంబాలు ఇక్కడ వృద్ధిచెందాయి.

## అప్పటి కాలమాన పరిస్థితులు - ఐరోపియాఆలోచనాపద్ధతి

వ్యక్తి, కుటుంబం, సమాజం అనే ఈ మూడు వేరు వేరు విషయాలను గురించి ఆలోచించేటప్పుడు పాశ్చాత్యులు ప్రతి విషయాన్ని గురించి కేవలం భౌతిక, ఐహిక సుఖాల దృష్టితోనే ఆలోచిస్తారు. వాళ్ళ సమాజాలు, దేశాలు నిర్మాణమై, అభివృద్ధి చెందిన పరిస్థితులనుబట్టి ఐహిక సుఖాలే వాళ్ళ ఆలోచనలకు మూలమైనాయి. క్రీ.శ॥ మూడవశతాబ్దంలో రోమ్ చక్రవర్తి క్రైస్తవ మతాన్ని స్వీకరించటానికి ముందు మొత్తం యూరోప్ అంతా వ్యాపించివున్న రోమ్ సామ్రాజ్యం క్రైస్తవులను వ్యతిరేకిస్తుండేది. కాని తర్వాత ప్రభుత్వ సహకారం వాళ్ళకు పూర్తిగా లభించి క్రైస్తవ మతం మొత్తం యూరప్‌లో వ్యాపించింది. క్రీ.శ. 5వ శతాబ్దంలో రోమన్ సామ్రాజ్యం పతనమైన తర్వాత యూరప్‌లో బలమైన రాజ్యం లేని కారణంగా, కర్రవున్న వాడిదే బర్రె అన్న సామెతగా 1,000 - 1200 సంవత్సరాలవరకు అంధకారయుగం నడిచింది. ఆకాలంలో క్రైస్తవ ఫాదరీలు బాగా డబ్బు సంపాదించారు. యూరోప్ ప్రజలు, రాజుల మీద కూడ వాళ్ళ అధికారమే కొనసాగింది. అదుపులేని అధికారం చేతికి రావటంతో మత గురువులు చాల అవినీతి పరులైనారు. ఎవరు ఏకొద్దిగా పైసలిస్తే వాళ్ళకే వాళ్ళు మోక్షద్వారం తెరవసాగారు. ఇలాంటి పరిస్థితిలో మతగురువుల అవినీతికి విసిగి పోయిన యూరోపు ప్రజల దృష్టి అవినీతి మయమైన మోక్షప్రాప్తినుండి ఐహిక సుఖాల వైపుకు మళ్ళింది. 1000 - 1200 సంవత్సరాలు ఇలాంటి వాతావరణం తర్వాత యూరోప్‌లో జాతుల నిర్మాణం

జరిగింది. ఐహిక సుఖమే వాళ్ళ జీవిత ధ్యేయమైంది. ప్రభుత్వమే సమాజానికి సర్వాధికారియైంది.

## యూరోపీయ ఆలోచన ప్రపంచమంతా వ్యాపించింది.

దేశకాల పరిస్థితులను బట్టి ఐహిక సుఖభోగాలవైపు దృష్టి మళ్లిన యూరోపియన్లు ఏదో విధంగా ఐహిక సుఖభోగాల సంపాదన కోసం ప్రపంచమంతా తిరగసాగారు. ప్రపంచంలోని ఐదు పెద్ద భూఖండాల్లో రెండైన అమెరికా, ఆస్ట్రేలియాల్లో జన సంఖ్య తక్కువ ఉన్నందువల్ల వాళ్ళుదాన్ని పూర్తిగా తమ స్వాధీనం చేసుకున్నారు. యూరప్ ఐతే వాళ్ళదే. అదే విధంగా ఆఫ్రికా, ఆసియాల్లోని పెద్ద భాగాల్లో కూడా వాళ్ళు తమ రాజ్యాలు నిర్మించారు. ఈ విధంగా ప్రపంచమంతా ఐరోపీయ రాజ్యాలు వ్యాపించటంతోపాటు భౌతిక ప్రధానమైన వాళ్ల నాగరికత, మొత్తం సమాజ జీవనాన్ని ప్రభుత్వ గుప్పిట్లో ఉంచుకునేపద్ధతి, యీ రెండిటి ప్రభావంకూడా ప్రపంచ ప్రజలమీద పడింది. ఆంగ్ల ప్రభుత్వ పరిపాలన కారణంగా కేవలం భారతీయుల మీదనే ఇలాంటి ప్రభావం పడలేదు.

## మనశ్శాంతిని ప్రసాదించే ఆలోచనా విధానం

ప్రపంచమంతా వ్యాపింపజేద్దాం. ఐరోపీయ దేశాల జాతీయ లేక సమాజ జీవనం యూరప్ తన అంధకార యుగం నుండి బైటపడిన 500 సంవత్సరాల కాలపరిమితి మాత్రమే కల్గివుంది. ఈనాడు వాళ్ళు ఎంతో సిరిసంపదలతో తలతూగుతున్నారు. జపాను, మలేషియాలాంటి కొన్ని దేశాలు కూడా 50,70 సంవత్సరాల్లోనే వాళ్ళతో సమానమైన భౌతిక సంపదను పొందగలిగాయి. అలాంటి భౌతిక సంపదపొందటానికి కొద్ది సమయం కూడా సరిపోతుంది. దీనికి ప్రత్యక్ష ఉదాహరణయే మనముందున్నది. కాని ఐహిక సుఖభోగాలు కుటుంబంలో వుండే వ్యక్తికివలె ఒంటరిగా వుండే వ్యక్తికి మనశ్శాంతిని

ప్రసాదించలేవు. ఈ విషయం, 5,6 వందల సంవత్సరాల పాశ్చాత్యుల జీవితానుభవాన్ని చూస్తే తెలుస్తుంది. భారతీయులు ఈ విషయాన్ని చాలా ప్రాచీన కాలంలోనే తెలుసుకున్నారు. భోగాలనుభవించిన కొద్దీ భోగవాంఛ పెరుగుతుందేకాని తగ్గదని వారు చెప్పారు. భోగాలనుభవించే వాళ్ళు పతనమైపోతారనికూడా వాళ్ళన్నారు. ఈ వాస్తవాన్ని తెలుసుకొని మనుష్యుడు కేవలం ఐహిక సుఖాలను పొందటమేకాక మానసిక, ఆధ్యాత్మిక సుఖాన్ని కూడా పొందినప్పుడే వ్యక్తి, 'కుటుంబం, సమాజం అన్నిటికి నిజమైన సుఖజీవనం, మనశ్శాంతి, దీర్ఘాయువు లభిస్తాయి. భారతీయులు యీ మూడు రకాల సుఖాలు లభించటానికి చేయవలసిన కర్తవ్యాలను గురించి ఆలోచించి, తెలుసుకొని, వాటిని సమాజానికి తెలియ జేయటంతోపాటు ఆసుఖప్రాప్తికి కావలసిన వ్యవస్థను కూడా ఏర్పాటు చేశారు. ఈ కారణంగానే భారతీయ సమాజ జీవనం శ్రేష్ఠమైన కుటుంబపద్ధతితో కూడి అనేక వేల సంవత్సరాలనుండి సుఖ-సమృద్ధులతో తులతూగుతున్నది.

సుఖ సమృద్ధులతో కూడిన మన సుదీర్ఘ సమాజ జీవన మూలతత్త్వాన్ని మర్చిపోయి అల్పాయువుగలిగిన యూరోప్ సమాజ భౌతిక ఆలోచనా పద్ధతిని భారతీయులు ( ఇందులో మేధావులు కూడా వున్నారు) ఎందుకు స్వీకరించారనే విషయం ఆలోచించటం అవసరం. ఆంగ్లేయులు మొత్తం భారత దేశంతోపాటు ఇతర ఐరోపీయదేశాలనుకూడా జయించి అక్కడ తమ రాజ్యాలను స్థాపించారనే విషయం ఈ సందర్భంలో మనం గుర్తించటం అవసరం. ఆంగ్లేయుల ఈ విజయాన్ని దాని వెనక ఉన్న వాళ్ల కర్తృత్వశక్తిని చూసి భారతీయులు కూడా మోహపరవశులైనారు. దానితోపాటే ఐరోపీయ దేశాల్లో అనేక ఆవిరియంత్రాలు, విద్యుత్తులాంటి వస్తువులు కనుక్కోబడి భారతదేశంలో కూడా రైళ్లు, టెలిఫోన్లలాంటి అనేక సౌకర్యాలు భారతీయులకు కలిగించబడ్డాయి. వీటి ప్రభావంకూడా వీళ్ల మీద పడింది. దానికారణంగా భారతీయులు దూరదృష్టితో ఆలోచించక దీర్ఘకాల ప్రయోజనంలేని భౌతిక ప్రధానమైన ఐరోపీయ

సంస్కృతిని స్వీకరించసాగారు. ఈకారణాలనుబట్టే అనేక ప్రపంచ దేశాలు ఆసంస్కృతి ప్రభావానికి లోనైనాయి. ఈవిధంగా పాశ్చాత్య సంస్కృతిని అవలంబించే ప్రజల సంఖ్య ఎక్కువైపోయింది. మరొక వైపు యూరోపీయ మేధావులు తమ సమాజంలోని వ్యక్తి, మరియు కుటుంబాల్లో చోటుచేసుకున్న దుష్ప్రవర్తనను చూసి చాలా విచారిస్తున్నారు. తాము స్వీకరించిన భౌతిక సంస్కృతియే దీనికి కారణమని కూడా వాళ్ళు తెలుసుకొని ఉత్తమ సంస్కృతి, జీవన విధానాల మార్గదర్శనం కోసం భారతదేశంవైపు చూస్తున్నారు. ఐరోపీయేతర సమాజాలు కూడా చాలా కొద్దికాలంలోనే ఈ భౌతిక సంస్కృతి ప్రభావానికిలోనై తాము నష్టపోతున్న విషయం తెలుసుకుంటున్నాయి. మొత్తం ప్రపంచ వ్యాప్త ప్రమాదంగా ఇది పరిణమించింది.. ఈ ఆపదనుండి బైటపడే మార్గం తెల్సుకోవటం భారతీయులకు చాలా సులభం. ఎందుకంటే మానవసమాజాన్ని సుఖశాంతులతో సుదీర్ఘకాలం జీవింపజేయగలిగిన ఉత్తమ సంస్కృతి, జీవన విధానాలు వాళ్ళకు పరిచయమేకాక సుదీర్ఘకాలం అలా జీవించిన అనుభవంకూడా వాళ్లకుంది. ఈ విధమైన ప్రపంచ వ్యాప్త ప్రమాదం నుండి మానవ సమాజాన్ని రక్షించటానికి కుటుంబం ఎలా వుండాలి? ఎలా నడవాలి అనే విషయం ప్రపంచ ప్రజలకు తెలియజేయాల్సిన బాధ్యత ఈనాడు భారతీయ సమాజం మీదనే ఉంది. ఇంతేగాక ఈకార్యం చేపట్టవల్సిన బాధ్యతకూడా వాళ్లమీదవుంది. ఇది ఈనాడు చాల అవసరం కూడా.

## రెండు ఆలోచనా పద్ధతుల్లో వున్న మౌలిక భేదం

మనుష్యుడికి మనశ్శాంతిని ప్రసాదించడంలో పాశ్చాత్య ఆలోచనాపద్ధతి కొద్దికాలంలోనే విఫలమైంది. కాని అది ఈనాడు ప్రపంచమంతా తన ప్రభావాన్ని చూపిస్తున్నది. భారతీయ ఆలోచనాపద్ధతి ప్రపంచంలో తన ప్రభావాన్ని చూపకపోయినా అనేక వేల సంవత్సరాలనుండి వ్యక్తికి మనశ్శాంతిని ప్రసాదించటంలో అది విజయవంతమైంది కాబట్టి దాని విషయం మొత్తం

ప్రపంచానికి తెలియటం అవసరం. భారతీయ కుటుంబ భావన, ఆచరణలను గురించి ఆలోచించటానికి ముందు పాశ్చాత్య, భారతీయ ఆలోచనాపద్ధతుల మధ్యవుండే భౌతిక భేదాలను గురించి తెల్సుకోటం అవసరం.

## సృష్టి నిర్మాణ విషయం

ఈ సృష్టి క్రీ.పూ. 4004 సంవత్సరంలో నిర్మాణమైందని పాశ్చాత్య క్రైస్తవులు చెబుతారు. సరియైన తేది, నెల, సంవత్సరం గురించి ఈ విషయంలో వాళ్ళ మధ్య కొన్ని భేదాభిప్రాయాలుండేవి. వాటిని తొలగించటానికి క్రీ.శ. 1664లో ఐర్లండ్‌కు చెందిన రివరెండ్ అర్షద్ అనే అతడు ఒక మతాదేశాన్ని జారీచేశాడు. అందులో అతడు 23-10-4004వ సంవత్సరం ఉదయం 9.00 గంIIలకు సృష్టినిర్మాణం జరిగిందని ప్రకటిస్తూ, ఎవరైతే దీనికి భిన్నంగా చెప్తారో వాళ్ళు మత వ్యతిరేకులని శిక్షింపబడతారని పేర్కొన్నాడు. పాశ్చాత్య భౌతిక శాస్త్రజ్ఞులు అణువులు ఘనరూపాన్ని చెందినప్పుడు అవి విడిపోయే ప్రక్రియలో జర్గిన విస్ఫోటనం ద్వారా సృష్టి నిర్మాణం జరిగిందని అంటారు. ఈ విస్ఫోటనానికి వాళ్ళు బిగ్ బాంగ్ అని పేరుపెట్టారు. హిందు సిద్ధాంతం ప్రకారం ఈ సృష్టి అతి విశాలమైంది, అనాది అనంత కాలం నుంచి ఇది వుంది. ఏ సూర్యమండలంలోనైతే ఈ భూమి వుందో అది ఇప్పటికి 200 కోట్ల సంవత్సరాలకు పూర్వమే నిర్మాణమైంది. ఇక ముందు 232 కోట్ల సంవత్సరాలుండి అది నశించిపోతుంది, ఇలాంటి సూర్యమండలాలు మన ఆకాశగంగలో అనేకం. ఇలాంటి ఆకాశగంగలు మన సృష్టిలో అనేకం ఉన్నాయి. ఈ సృష్టి నిర్మాతను అనంతకోటి బ్రహ్మాండ నాయకుడంటారు. ఈ అనంతకోటి బ్రహ్మాండనాయక పరమేశ్వరుడువైన పరమేష్ఠి మనస్సులో ఒకసారి ''నేను ఒక్కడినే వున్నాను, అనేకం అయితే బాగుంటుంది అనే ఆలోచన కలిగి (''ఏకోహం, బహు స్యామ'') అప్పుడే ఈ అనేక ఆకాశ గంగలతో, అనేక కోటి బ్రహ్మాండములతో కూడిన ఈ చరాచర సృష్టి నిర్మాణం జరిగింది.

## వ్యక్తి విషయం

సంపూర్ణ సృష్టి విషయం గురించి భారతీయ పాశ్చాత్య ఆలోచనలు ఎలా ఉన్నాయో మనం తెలుసుకున్నాం. ఇక ఇప్పుడు వ్యక్తి విషయం చూద్దాం. ఈ భూమీమీద నివసించే ఏ ఇతర ప్రాణిలో లేని బుద్ధి, యుక్తాయుక్త వివేకం పరస్పరం సాంఘికంగా ఆలోచించి ప్రణాళికలు రూపొందించి వాటిని కార్యరూపంలో పెట్టేశక్తి మానవుడికే ఉన్నాయని రెండు ఆలోచనా విధానాలు ఒప్పుకుంటాయి. వ్యక్తి తనకు లభించిన విశిష్టగుణాలద్వారా ఐహిక సుఖాలను పొందాలని ఈ సుఖ ప్రాప్తికొరకు అవసరమైతే ఈ చరాచర సృష్టినంతా వినియోగించుకోవచ్చునని పాశ్చాత్యులు భావిస్తారు. ఇలా చేయటంవల్లనే సృష్టి పర్యావరణం చెడిపోయి అది దాని సంతులనాన్ని కోల్పోయింది. సుఖోపభోగాల కోసం ఇతరులతో పోటీపడి వాళ్ళకు నష్టం కలిగించకుండా వుండటానికి ఎలాంటి నియమాలు అవసరమో అలాంటి నియమాలను ఏర్పరచుకొని వాటిని మనందరం ఆచరించాలనే ఒప్పందం పాశ్చాత్య ఆలోచనా పద్ధతికి చెందింది. వీళ్ళ ఆలోచనా పద్ధతి వ్యక్తి పరము, వ్యక్తి కేంద్రితమునైంది. వాళ్ళ కుటుంబజీవనం కూడా వ్యక్తి కేంద్రితమయ్యే వుంటుంది. దీని ఫలితంగానే విడాకులు, గర్భస్రావాలు అక్కడ ఎక్కువైనాయి.

''ఏకోహం బహుస్యామ'' అని పరమేష్ఠి నిర్ణయించి ఈ చరాచర సృష్టిని నిర్మించాడని భారతీయ ఆలోచనా పద్ధతి చెప్తుంది. అందువల్ల ఈ చరాచర సృష్టిలో పరమేశ్వరుని అంశ విద్యమాన మైంది.

ఈ చరాచర రూపాలన్నీ ఒక దానితో ఒకటి సంబంధం కల్గివున్నాయి. అందువల్ల పరస్పర శ్రేయస్సు కోసం అందరూపాటు పడాలని అపేక్షించబడుతుంది. ఇతర జీవరాశుల కంటె అనేక విశేషగుణాలు మానవుడికి భగవంతుడు ప్రసాదించాడు. అందువల్ల సహజంగానే సృష్టికి సేవచేయాల్సిన బాధ్యత, సృష్టి సంతులనాన్ని కాపాడాల్సిన బాధ్యత మానవుడి మీదనే ఎక్కువగా

వుంది. ఈ బాధ్యతను సక్రమంగా నిర్వహించటానికి మానవమాత్రుని ఆలోచన ఎలా వుండాలి? అనే విషయం మన ఋషులు ఈ క్రింది శ్లోకంలో ఇలా చెప్పారు.

*''త్యజేదేకం కులస్యార్థే, గ్రామస్యార్థేకులం త్యజేత్*
*గ్రామం జన పదస్యార్థే, ఆత్మార్థే పృధ్వీంత్యజేత్''*

''కుటుంబంకోసం అవసరమైతే వ్యక్తి తన సొంత పని వదిలి ముందుకురావాలి. అదే విధంగా కుటుంబం గ్రామం కోసం, గ్రామం దేశం కోసం, ఆత్మప్రాప్తికోసం మొత్తం పృథ్విని త్యాగంచేయాలి''. ఈ విధంగా పరసేవాభావాన్ని భారతీయులు ప్రతి వ్యక్తిలో జాగృతం చేసారు. వ్యక్తి ఇతరులపట్ల తనకుండే కర్తవ్యాన్ని పూర్తి చేయాలనే భావన కల్గిన కుటుంబాలే సమాజంలో సుఖపడతాయి. హక్కులకోసం పోరాడే కుటుంబాలు దుఃఖాన్నే పొందుతాయి.

పరమేశ్వరుని ఆత్మతత్త్వం మన ఇద్దరిలో వున్నదనే భారతీయుల మూల సిద్ధాంతం, స్వార్థం వదిలి పరోపకారం చేయాలనే భావనగల వ్యక్తులకు ఎంతో స్ఫూర్తినిస్తుంది. తమ కుటుంబకర్తృత్వంద్వారా భారతీయులను నిర్మాణం చేయటానికి భారతదేశంలో ఎలాంటి ప్రయత్నాలు జరిగాయి, వాటి ఫలితాలేమిటి అన్న విషయం మనం ముందు ముందు తెలుసుకుందాం.

## దుర్లభమైన మానవజన్మ

సృష్టితత్త్వాన్ని బాగా పరిశీలించిన తర్వాత ప్రాచీన భారతీయ విద్వాంసులు కొన్ని నిర్ణయాలకు వచ్చారు. తరువాత వాళ్ళు సామాన్య భారతీయునికి వాటిపై విశ్వాసం కలిగేట్లు చేశారు. ''ఏకోహం బహుస్యామ''ననుసరించి పరమాత్ముని అంశం ప్రతి ప్రాణిలో జీవాత్మరూపంలో నిలిచి వుంటుంది. మొత్తం 84 లక్షల జీవరాసులున్నాయని భారతీయుల విశ్వాసం. వాటి జీవిత కాలంగూడా వేరువేరుగా వుంటుంది. ఈ జీవాత్మలు

గూడా పునర్జన్మలు పొందుతాయి. అనగా ఒక ప్రాణిలో వున్న జీవాత్మ ఆప్రాణి చనిపోయిన తర్వాత దాని శరీరం విడిచి మరొక ప్రాణిలో ప్రవేశిస్తుంది. ఇది వాటి పునర్జన్మ. ఈ శరీర ప్రవేశం ఆ ప్రాణి, ఆ జన్మలో చేసిన కర్మనుబట్టి వుంటుంది. మంచి కర్మలు చేస్తే ఉత్తమ ప్రాణి శరీరంలో, చెడుకర్మలు చేస్తే అధమ ప్రాణుల శరీరంలో జీవాత్మ ప్రవేశిస్తుంది. దీన్నే కర్మసిద్ధాంతం అంటారు.

మానవ జన్మ మిక్కిలి దుర్లభమని భారతీయుల అభిప్రాయం. 84 లక్షల జీవరాసుల శరీరాల్లో ఈ జీవాత్మ తిరుగుతూ ఆ జీవరాసులు చేసిన మంచి, చెడు కర్మలఫలితాలనుభవిస్తూ చివరకు ఈ మానవజన్మను పొందుతుంది. మానవుల్లో ఇతర ప్రాణుల్లో లేని బుద్ధి, వివేకం మొదలైన ప్రత్యేక గుణాలుంటాయన్న విషయం మనం ఇదివరకే తెలుసుకున్నాం. తమ జన్మ సార్థకం కావాలంటే ఎలాంటి మంచి పనులు చేయాలి అనే వివేకం ఇతర ప్రాణులకు లేదు. వాటికి భోగవాసనయే తప్ప కర్మ వాసన వుండదు. అందువల్ల మొత్తం జీవరాసుల శరీరాలను భోగ భూమియని మానవుని బుద్ధి విశేషత కారణంగా అతని శరీరాన్ని భోగ, కర్మల సమ్మేళనంగల క్షేత్రమని భారతీయులు భావించారు. ఏయే కర్మలు చేయాలి, ఏయే కర్మలు చేయకూడదు అనే విషయాన్ని మానవుడు తన బుద్ధి బలంతో ఆలోచించి నిర్ణయించ గలగుతాడు. సహజంగా మనస్సు, ఇంద్రియాలవల్ల కలిగే వికారాలను బుద్ధిబలంతో నిగ్రహించగల శక్తి మానవుడికుంటుంది. మానవజన్మ దుర్లభమనే గుర్తింపు మనుష్యునికి ఉన్నట్లయితే అతడు తన జీవితంలో ప్రతిక్షణం ఉత్తమకర్మలు చేయటం అవసరమని గట్టిగా నమ్ముతూ ఆ దిశలో ప్రయత్నశీలుడౌతాడు. ఇలాంటి దృఢ విశ్వాసం భారతీయులందరిలో నెలకొని వుండటానికి, వాళ్ళు తన జీవితాన్ని ఉత్తమ కార్యాలద్వారా సార్థక పర్చుకోటానికి తగిన వాతావరణాన్ని ఈ సమాజంలో సుదీర్ఘకాలంగా భారతీయులు నెలకొల్పి వుంచారు.

# నాల్గుపురుషార్థాలు

84 లక్షల జీవరాసుల్లో జీవాత్మ ఎంతకాలం తిరుగుతూ వుంటుందనే విషయాన్ని కూడ భారతీయులు తెల్సుకున్నారు. జీవాత్మ పరమాత్మలో ఐక్యం కావటమే మోక్షం అనబడుతుంది. ఒక్క మానవుడు మాత్రమే తనకు లభించిన ప్రత్యేక గుణాలద్వారా జీవాత్మకు మోక్షాన్ని ప్రసాదించగల్గుతారు. ఇతర జీవరాసులకు ఇది సాధ్యంకాదు. 84 లక్షల జీవరాసుల్లో శ్రేష్ఠమైన మానవజన్మలో నిర్వహించాల్సిన బాధ్యతల విషయం ప్రతివ్యక్తికి సత్యం ఆధారంగా తెలియజేసే ఏర్పాటుకూడా భారతీయులు చేసారు.

ఈ విషయం తెల్సుకుంటేనే వ్యక్తి నిత్య జాగరూకుడై నిరంతర క్రియాశీలుడై వుండగల్గుతాడు. ఈ విధంగా పారలౌకిక, ఆధిదైవిక లేక నిశ్రేయస కర్తవ్య నిష్ఠను వ్యక్తి హృదయంలో గట్టిగా నిలిపే ప్రయత్నం భారతీయులు చేసారు.

వ్యక్తి ఇహలోకంలో చేసే కర్మల బాగోగులను బట్టే మరణం తర్వాత అతడికి మోక్షం లభించటంకాని లభించకపోవటం కాని జర్గుతుంది. ఐహిక జీవితం సుఖవంతంగా జరగటానికి సరిపడినంత ధనం ( జీవితం గడవటానికి సాధనాలు) వుండాలి. అదే విధంగా పంచేంద్రియాల తృప్తి, వంశపరంపర కొనసాగటం కామం ద్వారా జర్గుతుంది. అది కూడ ధర్మబద్ధమై వుండాలి. వ్యక్తిగత, సామాజిక బాధ్యతలను నిర్వహిస్తూనే వ్యక్తి అర్థకామాలు రెంటిని పొందటానికి ప్రయత్నం చేయాలి. ఈ బాధ్యతయే ధర్మం అనబడుతుంది. ఈ విధంగా మిక్కిలి సుదృఢమైన పూర్వ, పునర్జన్మల ఫలితంగా లభించిన మానవజన్మ ధర్మ, అర్థ, కామ, మోక్ష అనే చతుర్విధ పురుషార్థాలను పొందటంతో సార్థకం అవుతుందని భావించబడింది. ఈ చతుర్విధ పురుషార్థాలు సాధించటంద్వారానే మానవ జీవితం సర్వతోముఖాభివృద్ధిని పొందగల్గుతుంది.

## ధర్మ సాధనకు ముఖ్య ఆధారం కుటుంబం

మానవుడు ఒంటరిగా వుండి ఒక్కడే చతుర్విధ పురుషార్థాలను సాధించలేడు. భారతీయుల సాంఘిక జీవితానికి బీజం ఇక్కడే వుంది. పాశ్చాత్య జీవన పద్ధతిలోవలె సాంఘిక జీవితం మనమీదరుద్దబడలేదు. వ్యక్తి కేంద్రిత, భోగమయమైన పాశ్చాత్య ఆలోచనాపద్ధతిలో సాంఘిక వ్యవహారాలు వ్యక్తుల మధ్య కుదుర్చుకునే ఒప్పందాల మాదిరిగా వుంటాయి. తన సుఖ సంపాదనలో ఇతరులు అడ్డంతగలకుండా వుండాలనే ఉద్దేశంతోనే అక్కడ సాంఘిక ఒప్పందాలు (Social contracts) చేసుకోవటం జర్గుతుంది. భారతీయుల ఆలోచనాపద్ధతిలో సాంఘిక జీవనం స్వయంప్రేరణతో కూడుకున్నది. మానవుడు ఈ సృష్టిలో ఒక ప్రాణే కాబట్టి ఇతర ప్రాణులవలనే అతడుకూడ పకృతి సాధనాలను ఉపయోగించుకొని తన జీవయాత్ర కొనసాగించగలడు. కాని ఇలా చేయటంవల్ల భగవంతుడతనికిచ్చిన ప్రత్యేక గుణాల ద్వారా జీవాత్మకు మోక్షప్రాప్తిని కల్గజేయాల్సిన మహత్తర ధర్మం నుండి, ప్రకృతి సంతులనాన్ని కాపాడాల్సిన కర్తవ్యం నుండి అతడు దూరమైపోతాడు. ప్రత్యేక గుణాలతోపాటు భగవంతుడు మానవుడికి ఇంద్రియాలుకూడ ఇచ్చాడు. ఈ ఇంద్రియాల ఉపభోగం కోసం సృష్టిలో కావలసినన్ని సాధనాలనుకూడ అతడు సృష్టించాడు. ఇంద్రియాల ద్వారా ఈ సాధనాలను ఉపయోగించుకొని సుఖానుభూతిని పొందటంద్వారానే పరమేశ్వరుని సృష్టికి మనం స్వాగతం చెప్పగల్గుతాము. ప్రతివ్యక్తి ఈ చతుర్విధ పురుషార్థాలను సాధించాలనే ఉద్దేశంతోనే భారతీయులు ఇక్కడి సాంఘిక జీవన పద్ధతిని ఏర్పాటు చేశారు. వ్యక్తి, సమాజం ఈ రెండింటి మధ్య వుండే ఈ కుటుంబ అనుబంధాన్ని కాదని వ్యక్తికి సమాజంతోనేరుగా సంబంధం వుందని భావించబడే సమాజాల్లో వ్యక్తి స్వాతంత్ర్యమే ప్రాముఖ్యతను పొంది నియంతృత్వానికి దారితీయటమో లేక సమాజంలోని కొందరు వ్యక్తులు సమాజంలోని అన్ని రంగాలను శాసించటమో జరిగి వ్యక్తి స్వాతంత్ర్యం పూర్తిగా

నాశనమైపోయింది. అదుపు లేని వ్యక్తి స్వాతంత్ర్యంతో సామాజిక జీవనం సరిగా నడవక పోవటమో, లేక సమాజంలోని కొందరు వ్యక్తుల ప్రాబల్యం పెరిగి వ్యక్తిగత స్వాతంత్ర్యం అణిచివేయబడడమో జరిగింది. ఈ విధమైన నష్టాన్ని తొలగించటానికి భారతీయులు మానవ సమాజాన్ని చిన్న, చిన్న, సమూహాలుగా విభజించారు. అదే కుటుంబం. వ్యక్తి కుటుంబంతో జోడించబడ్డాడు. కుటుంబాలు సమాజంతో జోడించబడ్డాయి.

ఈ విధంగా వ్యక్తిని కుటుంబానికి, కుటుంబాన్ని సమాజానికి భాగం చేసి భారతీయులు వ్యక్తి, సమాజాల మధ్య ఒక విడదీయరాని అనుబంధాన్ని నిర్మించారు. దీనికారణంగా మొత్తం జీవితానికి ఒక స్థిరత్వం లభించి వ్యక్తితోపాటు సమాజం, సమాజంతోపాటు వ్యక్తి ఈ రెండు అంగాలు చక్కగా అభివృద్ధి చెందే ఏర్పాటు జరిగింది. వ్యక్తి సృష్టిలో ఒక భాగం, కొందరు వ్యక్తులు కల్సి ఒక కుటుంబం, కొన్ని కుటుంబాలు కలిసి సమాజం ఏర్పడతాయి. అందువల్ల సమాజ నిర్మాణంలో కుటుంబానికి చాలా ప్రాముఖ్యత వుంది. ఈ విధంగా వ్యక్తి, సమాజం, సృష్టి ఈ మూడింటిని సంతులనంగా వుంచటానికి, సమన్వయం చేయటానికి కుటుంబమే ముఖ్య ఆధారమైంది. అది ఒక వైపు వ్యక్తిని సృష్టితో జోడించి వుంచటంతో పాటు సమాజాన్ని సరియైన పద్ధతిలో నడిపిస్తూ ఈ కర్తవ్య నిర్వహణద్వారా అది గొప్ప జాతీయ బాధ్యతను కూడా నెరవేరుస్తుంటుంది.

## ఆశ్రమధర్మానికి వెన్నెముక కుటుంబం

మానవుడి జీవితం నూరు సంవత్సరాలని భారతీయులు భావించారు. తమ జీవిత కర్తవ్యాలను సక్రమంగా నిర్వహించటానికి ఈ జీవిత కాలాన్ని నాల్గు సమానభాగాలుగా వాళ్ళు విభజించారు. వీటికే ఆశ్రమాలనిపేరు. 'ఆసమంతాత్ ఆశ్రమం' అంటే అన్ని సమయాల్లో ఎక్కడ అజాగ్రత్త, సోమరితనం లేకుండా కర్తవ్యాన్ని నిర్వహించటం. ఈ నాల్గు ఆశ్రమాలను బ్రహ్మచర్య, గృహస్థ, వాన

ప్రస్థ, సన్యాసాశ్రమాలని పిలుస్తారు. నాల్గు ఆశ్రమాలకు కుటుంబమే పునాది. బ్రహ్మచర్యాశ్రమంలో కుటుంబంలోని బాలుడు నిశ్చింత మనస్సుతో జ్ఞానోపార్జన చేస్తాడు. గృహస్థాశ్రమంలో కుటుంబ యువకుడు కుటుంబ బాధ్యత నిర్వహణతో పాటు సమాజ ఋణం కూడా తీర్చుకోటానికి అవసరమైన అర్హతలను సంపాదించి కుటుంబ ప్రౌఢులకు కుటుంబ బాధ్యతలనుండి విముక్తి కల్గిస్తాడు. వాన ప్రస్థాశ్రమంలో కుటుంబ ప్రౌఢులు కుటుంబ సుఖ సమృద్ధుల విషయంలో తమకంటె చిన్న వాళ్ళకు మార్గదర్శనం చేస్తూనే స్వయంగా వీలైనంత ఎక్కువ తమ సమయాన్ని సమాజకార్యం కోసం వినియోగిస్తారు. ఈ విధంగా మూడవ ఆశ్రమంలో వ్యక్తి కార్యక్షేత్రం కుటుంబం నుంచి సమాజం వరకు వ్యాపించింది. నాల్గవదైన సన్యాసాశ్రమంలో అది ఇంకా వ్యాపించి మొత్తం ప్రపంచమే నాకుటుంబం అనే భావన ఏర్పడుతుంది. ఈ విధంగా నాల్గు ఆశ్రమాలకు వెన్నెముకవలె ఆధారభూతమైంది కుటుంబమే.

ఈ నాల్గు ఆశ్రమాల్లో కుటుంబ ఐహిక అవసరాలను పూర్తి చేయాల్సిన బాధ్యత ముఖ్యంగా గృహస్థాశ్రమమే నిర్వహిస్తుంది. ఈ గృహస్థాశ్రమ ప్రాశస్త్యం ఈ క్రింది శ్లోకంలో చక్కగా వర్ణించ బడింది.

''సానందం సదనం, సుతాశ్చసుధియః, కాంతానదుర్భాషిణీ, సన్మిత్రం, సుధనం, స్వయోషితి రతిశ్చ, ఆజ్ఞాపరాః సేవకాః ఆతిథ్యం, శివపూజనం, ప్రతిదినం మృష్టాన్న పానం గృహే సాధోః, సంగముపాసతే హిసతతం ధన్యా గృహస్థాశ్రమాః

ఎక్కడైతే ఇంట్లో అందరు సుఖంగా వుంటారో, ఇల్లు ఆనందంగా వుంటుందో? సంతానం బుద్ధి మంతులైవుంటారో? కాంత ( భార్య, ఇంకా ఇంట్లో ఎక్కువ సమయం నివసించే స్త్రీలు) చెడు మాటలు మాట్లాడే వాళ్ళు (తగువులు పెట్టేవాళ్ళు) కాక మధురభాషిణులై వుంటారో? దేనివల్ల కుటుంబజీవనం అందంగా, సుఖ సమృద్ధంగా జీవించటానికి వీలుగా

వుంటుందో? న్యాయంగా సంపాదించిన ధనం వుండి దేనిద్వారా అర్థ పురుషార్థం సార్థకమై కామాన్ని మోక్షోన్ముఖం చేయగల్గుతారో? సన్మార్గంలోకి నడిపించే, మంచి మిత్రులుంటారో? తన భార్యయందు ప్రేమకల్గి, నీతి వంతులు, శీలవంతులునైన యువకులుంటారో? ప్రేమతో అజ్ఞానపాలన చేసే సేవకులుంటారో? అతిథిదేవోభవ! అనే భావనతో వచ్చిన అతిథులకు సత్కారం జరుగుతుందో, అతిథి రాకతో నారాయణుడే తన ఇంటికి వచ్చాడన్నంత ఆనందం కలుగుతుందో? ప్రతి రోజు భక్తిభావంతో భగవంతుని పూజజరుగుతుందో? భగవత్ప్రసాదరూపమైన రుచిగల వివిధ పదార్థాలతోకూడిన సాత్త్విక భోజనంతో అందరి రక్షణ పోషణ జరుగుతుందో? ఆనందోత్సాహాలతో కూడి ఎల్లప్పుడు సాధువులు భక్తులు ఎక్కడైతే పూజింప బడతారో అలాంటి గృహస్థ (కుటుంబ) జీవనం ధన్యమైంది.

ఈ విధమైన ఒక ఆదర్శవంతము, ఆనందదాయకము, సుఖప్రదమునైన కుటుంబస్వరూపం కొంత శిథిలమైన రూపంలోనైనా ఈనాటికీ మనకు కనబడుతున్నది.

## పతీపత్నుల సంబంధం

ఈ విధంగా ధన్యమైన గృహస్థాశ్రమంలో అడుగుపెట్టటానికి అవసరమైన సంస్కారమే వివాహం. కుటుంబ బాధ్యతలను నిర్వహిస్తూ సామాజిక ఋణం తీర్చుకోవటమే గృహస్థాశ్రమ ధర్మం. అందువల్ల సహజంగానే భారతీయుల ఆలోచనల ప్రకారం గృహస్థాశ్రమం వ్యక్తిగత సుఖాలనుభవించటానికి కాదు. దేశధర్మ దైవసేవలు నిర్వహించటానికి, ఉత్తమ సంతాన ప్రాప్తికి మాత్రమే అది ఉద్దేశింపబడింది. సంకల్పం సాఫల్యమే సంతానం. ఇదొక వరమేగాని శాపంకాదు. ఇలాంటి ఉత్తమ సంకల్పంతో కలిగిన సంతానం తన పూర్వీకుల కీర్తిని ఇంకా వృద్ధిపరుస్తూ వాళ్లకు ఉత్తమ లోకాలను కలుగజేస్తుంది. రాక్షస శ్రేష్ఠుడైన

ప్రహ్లాదుడు తన తండ్రిని ఉద్ధరించమని నరసింహావతారమును ప్రార్థించగా భగవద్భక్తుడు జన్మించిన వంశంలోని ఇరవై ఒక్క తరాలు వాటంతటవే ఉద్ధరింపబడతారని ఆయన సమాధానమిచ్చాడు.

''జననీ జనేతో భక్తజన్, యాదాతా యాశూర్,
నహీతో రహీయో బాంఝునీ, మత్‌గుమాయి యోనూర్''

ఈ విధంగా గృహస్థాశ్రమం భోగానికి గాక యోగానికి సాధనం. వివాహం ఒక ఒప్పందంకాక ఒక బంధం, కర్తవ్యబంధంగా భావించబడుతుంది. ఈ ఒక్కజీవితంలో అన్యోన్యసంబంధంకాక జన్మ జన్మాంతర సంబంధానుభూతి గృహస్థుకు కల్గుతుంది. భర్త అంటే పరమేశ్వరుడు, భార్య అంటే సహధర్మచారిణి అనే భావన, భార్యాభర్తల అన్యోన్య ప్రేమను సార్థకం చేస్తుంది. మహమ్మదీయ సాంప్రదాయంలో వుండే తలాక్, పాశ్చాత్య సాంప్రదాయంలో వుండే విడాకులు భారతీయ కుటుంబ సంప్రదాయానికే విరుద్ధమైనవి. వివాహమైన తరువాత వ్యక్తిగత ఇష్టానిష్టాలకు తావులేదు. ఇరువురి వ్యక్తిగత ఇష్టానిష్టాలు కుటుంబసంక్షేమం కోసం త్యాగం చేయబడతాయి. కుటుంబ సంక్షేమం కోసం నిర్వహించవలసిన పాత్ర గురించే వాళ్లు ప్రముఖంగా ఆలోచిస్తారు. భార్యాభర్తలు ఉత్తమ సంస్కారాలను పొంది తమ జీవితసారాన్ని కుటుంబం కోసం వినియోగించాలనే మహోన్నత లక్ష్యం కలిగి ఉండటంవల్ల ఇతర అల్పవిషయాలు తమ ప్రాముఖ్యతను కోల్పోతాయి. సంతానోత్పత్తి, భార్యాభర్తల ఇంద్రియ తృప్తి కోసం కాక పరమేశ్వర కార్యంలో అదొక భాగమవుతుంది. ఇలాంటి ఉత్తమ సంతాన్ని తల్లిదండ్రులు తమను తాము ప్రేమించుకొన్న దాని కంటే ఎక్కువగా ప్రేమిస్తారు ఈ కారణంగా తమ సంతానాన్ని విడచిపెట్టి ఏ తల్లిదండ్రులు ఒంటరిగా ఉండలేరు. అందువల్ల భారతీయుల సంతానం తల్లిదండ్రుల రెండు శరీరాలను ఒక ప్రాణంగా రూపొందిస్తుంది. ఇద్దరూ కలిసి కుటుంబంలో ఒకే భాగమైపోతారు. దీన్ని బట్టే ఆపస్తంభసూత్రంలో

''జాయాపత్యోరభేదః'' అని చెప్పబడింది. 'సంతానం దేహజం' - అంటే శరీరం నుండి పుట్టిందికాదు. 'ఆత్మజం' - అంటే ఆత్మనుండి పుట్టిందని చెప్పబడుతుంది. ఎవరి ఆత్మమీద వాళ్లకు సాటిలేని ప్రేమ వుండటం సహజమే. భార్యాభర్తల ఈ ఏకత్వం అన్నిరంగాల్లో వుంటుంది. వాళ్ల స్వభావాలు ఒకటికాకపోయినా వాటిని పరస్పరానుకూలపరచుకోవాలనే కోరిక వాళ్లలో వుండి దానికోసం వాళ్లు కృషిచేస్తారు. భార్యాభర్తలిద్దరు ఒకరినొకరు విడిచి పెట్టుటమనేది భర్త దేశద్రోహియైనప్పుడో, భార్య గర్భవిచ్ఛిత్తికి పూనుకొన్నప్పుడో తప్ప ఇతర సందర్భాల్లో సహజంగా జరగదు. దాంపత్య జీవితంలోవున్న ఈ స్థిరత్వమే కుటుంబ సుదృఢత్వానికి పునాదిగా వుంటుంది.

## సంస్కారాలకు ముఖ్య కేంద్రం

భారతీయ సమాజ నిర్మాణంలో కుటుంబానికి అత్యంత మహత్త్వపూర్ణమైన, మధ్య వర్తిత్వస్థానం వుంది. సమాజ శ్రేయస్సును కోరిన మహర్షులు ఆదర్శసమాజంకోసం అవసరమైన వ్యవస్థ, సిద్ధాంతాలు, సంస్కారాలు అన్నిటిని కుటుంబంద్వారానే నెలకొల్పారు. సంస్కార నిర్మాణానికి ముఖ్య కేంద్రం కుటుంబమే. దీనిద్వారా వాళ్ళు కోరిన ఆదర్శ సమాజం దానంతటదే నిర్మాణమైంది. దానికోసం ప్రత్యేకం కృషి చేయాల్సిన అవసరం లేకపోయింది. గర్భస్థ శిశువు పోషణ తల్లి శరీరం నుండి జరుగుతుంది. ఈ పోషణ శిశువు నాభిద్వారా జరుగుతుంది. శిశువు పోషణ, అభివృద్ధి బాధ్యత తల్లి మీదనే వుంటుంది. ఈ విధంగానే కుటుంబంద్వారా సమాజ పోషణ, రక్షణ జరుగుతాయి. ఆశ్రమ వ్యవస్థ ద్వారా సమాజానికి కలిగే ప్రయోజనం కుటుంబంద్వారానే జరుగుతుంది. కుటుంబం సమాజమనే శిశువుకు నాభిలాంటిది.

# సమన్వయ పూర్వక కర్తవ్యాలకర్మభూమి కుటుంబం

అస్తమించబోయే సూర్యుడు లాంటి వృద్ధులు మొదలుకొని లేలేబాయపు శిశువులవరకు కుటుంబంలో అన్ని రకాల వ్యక్తులు వుంటారు. వాళ్ళు ఎంతో ఉత్సాహవంతంగా తమకు నిర్దేశించిన బాధ్యతలను నిర్వహించటానికి ఎప్పుడు తత్పరులై వుంటారు. అందరు కలిసి తమ తమ కర్తవ్యాలను నిర్వహించే కర్మభూమిగా కుటుంబం తయారవుతుంది. కుటుంబంలో హక్కుల కోసం పోరాటం కాక కర్తవ్య నిర్వహణకే ఎక్కువ ప్రాముఖ్యత వుంటుంది. అక్కడ ఆబాల వృద్ధులు కర్తవ్యమనే పట్టుదారంతో బంధింపబడి పనులు చేస్తారు. తాత, నాయనమ్మ, తాత, అమ్మమ్మ తల్లి, తండ్రి, వదిన, మొ॥ వాళ్ళందరికి సేవచేయటం, కుటుంబంలో వుండే చిన్నవాళ్ళందరు తమ ప్రముఖ కర్తవ్యంగా భావిస్తారు. కర్తవ్యమనే పట్టుదారం మెత్తగా, మృదువుగా, అందంగా వున్నా చాలా గట్టిగా వుంటుంది. పెద్దలకు, వృద్ధులకు సేవచేసే తమ కర్తవ్యాన్ని నిర్వహించే సమయంలో పిల్లలు తమ సుఖదుఃఖాలను కూడా మర్చిపోతారు. కర్తవ్యబోధయొక్క మధుర భావనతో వాళ్ల హృదయం నిండి పోయి వ్యక్తిగత కోరికలవైపు వాళ్ల మనస్సు పోనేపోదు. తాతయ్యైన ఉగ్రసేనుని కష్టాలు తొలగించటానికి శ్రీకృష్ణబలరాములు తమ జీవితాలను పణంగా పెట్టారు. భీష్ముడు మృత్యుశయ్యమీద పడి వున్నప్పుడు పాండవులు తమకు భీష్ముని సేవించే సదవకాశం లభించినందుకు తామెంతో ధన్యులమైనామని భావించారు. శ్రావణ కుమారుడు తన తల్లిదండ్రులను కావడిలో కూర్చోబెట్టుకొని తీర్థయాత్రలు చేయించాడు.

కేవలం పురాణకాలంలో ఇలా జరిగేది, ఈ కాలంలో జరగదు అనికాదు.

క్రీ.శ. 1991 సెప్టెంబర్‌లో ఉత్తర ప్రాంతానికి చెందిన నాలుగు ధామాలు బదరీనాథ్, కేదార్‌నాథ్, గంగోత్రి, యమునోత్రి) యాత్ర చేసిరావటానికి ళ్ళాం. అప్పుడు యమునోత్రియాత్రలో రాజస్థాన్ ప్రాంతం జయపూర్

పట్టణం నుండి వచ్చిన ఇద్దరు, సోదరులను దర్శించే అదృష్టం కలిగింది. ఒకరి వయస్సు సుమారు 60, రెండవవారి వయస్సు సుమారు 50, 55 వుంటుంది. ఇద్దరు వృద్ధురాలైన తమ తల్లిని యాత్రచేయించటానికి తీసుకువచ్చారు. కాలినడకన యాత్ర చేయాలని తల్లికోరిక, ఇద్దరు సోదరులు ఆమెకాళ్ళు మాత్రము భూమికానుతూ, మార్గంలో వున్న ముళ్ళు, రాళ్ళు ఆమెకేమాత్రం బాధ కల్గించని విధంగా తల్లిని తమ భుజాల సహాయంతో మోస్తూ నాల్గుధామాలు యాత్రను ఆమెతో పూర్తిచేయించారు. వాళ్ళ మాతృభక్తిని చూసి మేం ఇది కలియుగమన్న విషయం మర్చిపోయి సత్యయుగంలో వున్నామన్నట్లని పించింది. మాతృభక్తి తత్పరులైన ఆ పుత్రులను కన్నతల్లిని చూసి మా హృదయం ఆమె పట్ల పవిత్ర గౌరవ భావంతో నిండిపోయింది. మన మాతృభూమి భారతదేశంలో ఇలాంటి పవిత్ర దృశ్యాలు అక్కడక్కడ ఇప్పుడు కూడ కన్పిస్తాయి.

పెద్దల సేవాశుశ్రూషలు పిల్లలు తమ అదృష్టంగా భావించి చేసినట్లే పెద్దలుకూడ పిల్లలను అభివృద్ధిలోకి తేవటం వాళ్లను సంస్కార వంతులుగా తీర్చిదిద్దటం తమ ప్రముఖ కర్తవ్యంగా భావిస్తారు. పిల్లల శ్రేయస్సుకోసం ఎంతటి పెద్దకష్టాన్నైనా పెద్దలు సంతోషంతో భరిస్తారు. అన్ని ఆపదలను పెద్దలే భరించి పిల్లలకు వాటి బాధ ఏమాత్రం కలగకుండా చూస్తారు. మనం జీవించి వున్నంతవరకు మన పిల్లలకు ఎలాంటి ఆపదరాకూడదనే భావనయే పిల్లలను సురక్షితంగా వుంచటానికి వాళ్లకు స్ఫూర్తినిస్తూ వుంటుంది. ప్రేమతో కూడిన ఈ కర్తవ్యనిష్ఠయే వాళ్ల సొంత సుఖాలను త్యాగం చేయించి స్వజనుల సుఖం కోసం ఎంత కఠిన కార్యాన్నైనా చాలా సహజంగా వాళ్లతో చేయిస్తుంది. ఇలా చేయాలనే అందరు కోరుకుంటారు. దీనిద్వారా మొత్తం కుటుంబం అప్రయత్నంగానే ఒక విధమైన సాత్విక సుఖసంతోషాలతో ఓలలాడుతుంది. కుటుంబంలో అందరు ప్రేమపూర్వక కర్తవ్య నిర్వహణ భావంతో పనిచేయటంవల్ల ఎవరికీ ఏ పని భారం అనిపించదు. అంతేగాక చక్కని

మనశ్శాంతి కూడ లభిస్తుంది. ఈ విధంగా కుటుంబజీవనం ఒక భారంగాకాక ఆనందంగా మారిపోతుంది. ఒకజాతి సువ్యవస్థితరూపంలో నిలిచి వుండటానికి సమాజం నిర్వహించాల్సిన బాధ్యతలు, చేయాల్సిన త్యాగాలను పోలిన కర్తవ్య త్యాగాలనే కుటుంబంలో సభ్యులుకూడ తమ కుటుంబంకోసం, గ్రామంకోసం, సామాన్య సమాజంకోసం చేస్తారు.

## కుటుంబపెద్ద

భారతదేశంలో అనేక వేల సంవత్సరాల నుండి సమిష్టి కుటుంబవ్యవస్థ విజయవంతంగా కొనసాగుతూ వస్తున్నది. కుటుంకోసం సొంత సుఖాలను త్యాగం చేసే స్వభావం, సుఖదుఃఖాలను సంతోషంగా స్వీకరించడం, ఈ గుణాలే సమష్టి కుటుంబవ్యవస్థకు ఆధారభూతమై వున్నాయి. జీవన వ్యవహారంలో 'నేను' కాదు 'మనం', 'నాది' కాదు 'మనది' అనే ఆత్మీయభావనయే కుటుంబ సభ్యులందరినీ ప్రేమసూత్రంలో బంధించి వుంచుతుంది. కుటుంబపెద్ద ఎవరుండాలనే విషయంలో ఎవరూ తగువు పెట్టుకోరు. వయస్సులో పెద్ద వాడే సహజంగా కుటుంబంలో అందరి మన్ననలను పొందుతూ కుటుంబ పెద్దగా వ్యవహరిస్తాడు. వ్యక్తిగత యోగ్యతలు, శక్తి సామర్థ్యాలు నైపుణ్యం - ఇవేవీ పదప్రాప్తి పోటీ కోసం ఎవరినీ ప్రేరేపించవు. అంతేగాక కుటుంబ సుఖ సమృద్ధి, గౌరవ మర్యాదల కోసం సహజంగానే అందరూ తమ తమ యోగ్యతలను కుటుంబ శ్రేయస్సుకోసం సమర్పిస్తారు. పరస్పర కుటుంబప్రేమ వ్యక్తుల్లో వుండే మహత్వాకాంక్షను దూరం చేస్తుంది. కుటుంబ రంగంలో వ్యక్తిగత మహత్త్వాకాంక్ష అసలు మొలకే ఎత్తదు. ''నా మాతృభూమి గౌరవ మర్యాదలు పొందటానికే నేను ఏవో కొద్ది గుణాలు సంపాదించాను'' అని సావర్కారుగారు అన్నారు. తమ కంటే వయస్సులో పెద్దలనుకాదని తాము సుఖాలనుభవించటం, ఉచితంకాదనే భావన ఎవరికీ వ్యక్తిగత అహంకారాన్ని కలగనీయదు.

కుటుంబంలో అన్ని పనులు సమయానుకూలం, అనుకున్న ప్రకారం ఒక

పద్ధతి ప్రకారం జరుగుతున్న కారణంగా కుటుంబ సభ్యుల్లో ఒకసాటిలేని విశ్వాసం ఏర్పడి ఎవరికీ తమ భవష్యత్తు గురించిన చింతయే వుండదు. అందువల్ల తమ భవిష్యత్తును గురించి భయపడి కుటుంబంలో ఎవరూ చెడు పనులు చేయరు. కుటుంబ ప్రేమ ప్రవాహం గంగోత్రి నుండి గంగా సాగరంవైపు ప్రవహిస్తుంది. కుటుంబంలో జ్యేష్ఠుడికి తన కనిష్ఠుడి గురించిన ఆలోచనవుంటుంది. ప్రతి కనిష్ఠుడు, తన జ్యేష్ఠుడిమీద సంపూర్ణ విశ్వాసం వుంచి అతనిమీదనే ఆధారపడతాడు. ప్రేమ, విశ్వాసాల ఈ సూత్రం ఎంతో సుకుమారమైనదైనప్పటికీ చాలా దృఢమైంది. ఈ దృఢత్వంకారణంగానే ఈనాటివరకు కుటుంబబంధాలు తెగిపోకుండా వున్నాయి. కుటుం బంలోని సభ్యులందరికీ ఆలోచనా స్వాతంత్ర్యం వుంటుంది. దీనిమూలంలో కూడా కుటుంబకళ్యాణ భావనయే నెలకొని వున్నందువల్ల వ్యక్తి విశృంఖలుడు కాడు. అంతేకాక సుస్థిరుడై కుటుంబ నిర్ణయాలను శిరసావహిస్తాడు. కుటుంబంలో ఎలాంటి క్లిష్ట సమస్యవచ్చినా కుటుంబపెద్ద నిర్ణయానికే ప్రాధాన్యత ఈయబడుతుంది. వయస్సులో పెద్దకావటం, అనుభవం కలిగివుండటం కారణంగా కుటుంబ సమస్యలను నిష్పక్షపాతంగా పరిష్కరించే సామర్థ్యం అతనికుంటుంది. కుటుంబంలో కనిష్ఠుడుకూడా ఒక వేళ ప్రతిభా సంపన్నుడు, వివేకవంతుడు ఐనట్లయితే అతని అభిప్రాయం కూడా దృష్టిలోకి తీసుకోబడుతుంది. రాజధానిని మధురనుండి ద్వారకకు మార్చాలనే మహత్త్వపూర్ణమైన నిర్ణయాన్ని శ్రీకృష్ణుని సలహాతోనే ఉగ్రసేనుడు, ఇతర సైనికులు తీసుకున్నారు. పెద్దలను పూజించే విషయంలో సహదేవుని అభిప్రాయం అంగీకరించబడింది. కుటుంబపెద్ద అధికార మదాంధులు ఎప్పుడూ కారని చెప్పటమే దాని ఉద్దేశం. కుటుంబంలో అతనిస్థానం శరీరంలో ముఖంతో సమానమైంది.

''ముఖియా ముఖ్‌సోచాహియే ఖాన్ పాన్ కో ఏక్
పాలై పోషై, సకల అంగ్ తులసీ సహిత వివేక్''

కుటుంబ కళ్యాణ భావన, అనుభవజన్యమైన వివేకం, నిష్పక్షపాతంగా వ్యవహరించే సామర్థ్యం అతని ప్రవర్తనలో ఎంతో గొప్పదనాన్ని తీసుకువస్తాయి. దీనికారణంగా అతడు భిన్న స్వభావాలుగల కుటుంబసభ్యులందరినీ ఒకే సూత్రంలో నిలిపి వుంచగల్గుతాడు.

## కొత్తకోడలు కుటుంబానికి రాణిలాంటిది - ఋగ్వేదం

కుటుంబంలో అడుగుపెట్టే కొత్తకోడలుకు ఆకుటుంబంలో చాలా ప్రముఖ స్థానం వుందని ఋగ్వేదంలో చెప్పబడింది. ఋగ్వేదం (10-85-42) ప్రకారం ఆమె ఆశీర్వాదం కుటుంబ పెద్దలద్వారా మొత్తం కుటుంబానికి లభించి భవిష్యత్తులో ఆమె ఆగృహానికి రాణికావాలి. 15,20 సంవత్సరాల వయస్సుగల ఒక కన్య భర్త కుటుంబంలో మొదటిసారి అడుగు పెట్టడంతోనే ఆమెలో ఇంతమార్పు వస్తుందని ఊహించటం కష్టం. కాని కుటుంబం సరియైన పద్ధతిలో నడవటానికి, కొత్త తరానికి యోగ్యమైన సంస్కారాలివ్వటానికి ఇలా చేయటం అవసరమని భారతీయులు భావించారు. ఇలాంటి గుణాలు ఆమెలో వికసింపచేసే బాధ్యతను కుటుంబపెద్ద, కొత్తకోడలు ఇద్దరిమీదా వుంచారు. పైన పేర్కొనబడిన మార్పు సాధ్యమనే విషయం అనుభవాన్ని బట్టి తెలుస్తున్నది. కుటుంబపెద్దలు ఎంతో ఆత్మీయంగా కొత్తకోడలును చూసుకుంటూ ఆమె మనస్సును జయిస్తారు. దీనివల్ల ఆమె తన మనస్సు విప్పి కుటుంబపెద్దలతో మాట్లాడుతుంది. స్వయంగా కోడలుకూడా కుటుంబంలో కలిసిపోవటానికి ప్రయత్నిస్తుంది. ఈ విషయం ఆచరణలో పెట్టటం చెప్పినంతతేలికకాదు. వ్యక్తి యొక్క సమగ్రవికాసానికి హిందూ ధర్మంలో 16 రకాలైన సంస్కారాలు ఏర్పాటు చేయబడ్డాయి. వాటిల్లో వివాహం 13వ సంస్కారం. ఈ 13 సంస్కారాలు పుట్టింట్లో జరిగిన తరువాత కోడలు కుటుంబం మారిపోతుంది. ఐనప్పటికీ వ్యక్తిగత జీవితం కంటే కుటుంబజీవితానికి ప్రముఖ స్థానం ఈయాలనే భారతీయ సంస్కారం కారణంగా కొత్తకోడలు పాలల్లో పంచదారవలె కొత్త

కుటుంబంలో కలిసి పోతుంది. కొత్త కుటుంబ సంప్రదాయాలను, కుటుంబం వ్యక్తుల స్వభావాలను తెలుసుకోవటానికి ఆమె ప్రయత్నిస్తుంది. ఎంతో కష్టపడి కుటుంబసభ్యుల మనస్సులను ఆమె తన ప్రేమ పూర్వక వ్యవహారంతో జయిస్తుంది. పుట్టింటికి సంబంధించిన ఉత్తమ సంస్కారాలను ఆమె అత్తవారింట్లో కూడా ప్రవేశపెట్టి తన భర్త వంశగౌరవాన్ని మరింత పెంపొందింపజేస్తుంది. తన వ్యక్తిగత గుర్తింపుకోసం ఆమె ఎప్పుడు పాటు పడదు. ప్రకృతి, శ్రేష్ఠ వస్తు నిర్మాణం కోసం తన సర్వస్వాన్ని సమర్పించినట్లే ఉత్తమశక్తి రూపంలో కొత్తకోడలు కూడా తన్ను సమర్పించుకోటానికి సిద్ధపడి కుటుంబాన్ని తన గుణయోగ్యతల ద్వారా ఉత్తమోత్తమంగా తీర్చిదిద్దుతుంది.

ప్రతి కుటుంబానికి కొన్ని ప్రత్యేక సంప్రదాయాలు, ఆచారాలు, వ్యవహారాలు వుంటాయి. ఒకకుటుంబం తరతరాలుగా కలిగి వున్న ప్రత్యేక గుణాలు ఆ వంశ వ్రతంగా చెప్పబడుతుంది. ఉదాహరణకు రఘువంశం గురించి ఇలా వర్ణించబడింది. ''రఘుకులరీతి సదా చలీ ఆయీ, ప్రాణ్ జాయీ పర్‌వచన్ నజాయీ'' ఈ వంశ వ్రత శిక్షణ ప్రత్యేక విద్యాలయాల్లో ఈయబడదు. ఒకరి ఆచరణను చూసి మరొకరు నేర్చుకుంటూ వుంటారు. ఈ విషయంలో కుటుంబపెద్దలు నిర్వహించే పాత్ర ఎంత ముఖ్యమైందో కుటుంబస్త్రీలు నిర్వహించే పాత్ర కూడా అంతే ముఖ్యమైంది. సత్యనిష్ఠలో రఘువంశానికున్న పట్టుదల దిలీప్, రఘు, అజ, దశరథ చక్రవర్తులందరిలో మనకు కన్పిస్తుంది. వంశపారంపర్యమైన ఈ గుణం శ్రీరాముడిలో ఇంకా విశేషంగా వ్యక్తమైంది. ఈ గుణ నిర్మాణంలో శ్రీరాముని తల్లులు నిర్వహించిన పాత్ర కూడా చాలా ఉంది. మొలకెత్తిన తమ పిల్లల జీవితాలను తల్లులే వికసింపజేస్తారు. ఈ విధమైన వంశవ్రత శిక్షణ సంతానానికిచ్చే కార్యంలో కొత్త కోడలు కూడా ఎంతో నిష్ఠతో తన కర్తవ్యాన్ని నిర్వహిస్తుంది. తన సంతానాన్ని ఉత్తమ గుణవంతులుగా తీర్చిదిద్ది దాంతోపాటే దేశ, ధర్మాలకు ఉపయోగపడేవిధంగా వాళ్లను తయారుచేసే పనికూడా చేస్తుంది.

# కుటుంబశ్రేయస్సే ధ్యేయం

కుటుంబంలో డబ్బు సంపాదన, కులవృత్తి, పిల్లల పెంపకం, చదువు సంస్కారం, సమాజంలో పండగలు మొదలైన అనేక రకాల పనులుంటాయి. కుటుంబంలో ప్రతివ్యక్తి తన శక్తి సామర్థ్యాలు యోగ్యతనుబట్టి ఏదో ఒక పనిని స్వయంగా చేపడ్తాడు. వ్రాత పూర్వకమైన బాధ్యత ఏమీ వుండదు. బాధ్యత నిర్వహించకపోతే శిక్షగూడా ఏమీలేదు. కాని అనేక యుగాలనుండి భారతీయ కుటుంబంలో సభ్యులకు వాళ్ల కర్తవ్యాన్ని గురించి గుర్తు చేయాల్సిన అవసరం ఎప్పుడూ కలగలేదు. ఎవరూ చెప్పకుండానే అత్తబాధ్యతలను కోడలు స్వీకరిస్తుంది. పెద్దకోడలుకు చిన్న కోడలు సహకరిస్తుంది. బావగార్ల పిల్లలను మరదళ్లు ప్రేమతో దగ్గరికి తీస్తారు. తరుచుగా పిల్లలు తమ పినతండ్రులు పిలిచినట్లే తల్లిదండ్రులను అన్న, వదినె అని పిలవటం కూడా జరగుతుంది. కొన్నాళ్లకు పెద్ద వాళ్లైన అన్న పిల్లలు తమ పినతండ్రుల పిల్లలను ఆడిస్తూ పాడిస్తూ తల్లి దండ్రులకు వీళ్ల విషయంలో ఏవిధమైన చింతలేకుండా చేస్తారు. సమష్టి కుటుంబాల పిల్లల్లో ఈ విధమైన వాతావరణం అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నది. కుటుంబంలోని అవివాహిత కన్యలు తమ వదినెలకు సహకరిస్తూ వుంటారు. వీలైనంత ఎక్కువ ఇంటి పని తామే చేసి వదినెలకు విశ్రాంతినీయాలని వాళ్లనుకుంటారు. ఈ పెళ్లికాని కన్యలు కొద్దిరోజుల్లో అత్తవారిళ్లకు వెళ్లి అక్కడ ఎలాగూ పనిచేయాలి ఇక్కడ విశ్రాంతి తీసుకుంటే మంచిదని వదినెలు అనుకుంటారు. వదినెలు, ఆడపడుచుల మధ్య ఇలాంటి సత్సంబంధాలు ఎప్పుడూ నెలకొని వుంటాయి. ఇలాంటి మానసిక ప్రవృత్తియే ఇంటి మగవాళ్లల్లో కూడా వుంటుంది. ఇంటి పనుల్లో పినతండ్రులు, అన్నదమ్ములు అందరూ తండ్రికి సహాయపడుతూ ఆత్మ సంతృప్తిని పొందుతారు. పొలం పనుల్లో ఆసక్తి ఉన్నవాళ్లు స్వయం ప్రేరణతోనే కఠిన శ్రమతో కూడిన ఆపనులకు పూనుకుంటారు. వ్యాపారం, ఉద్యోగాల్లో ఆసక్తి వున్నవాళ్లు ఆపనులే చేసి డబ్బులు సంపాదిస్తారు. కుటుంబంలో ప్రతి వ్యక్తి తన

సామర్థ్యాన్ని బట్టి, కుటుంబ అవసరాన్ని బట్టి ఏదో ఒక పనిని తానే స్వయంగా చేపడ్తాడు. తనకు ఆసక్తి వున్నపనులను అతడు సంతోషంతో పరుగెత్తుతూ చేస్తాడు. కాని ఆసక్తిలేని పనులను కూడా కుటుంబ అవసరాలను బట్టి అతను చేయటానికి పూనుకుంటాడు. తన మనస్సుతో, ప్రేమతో, ఈకార్యంలో నాసహకారం కూడా కొంతవుంది అనే ఆత్మగౌరవంతో అతను చేస్తాడు. ''ఎక్కడపని వుందో అక్కడ మేం'' అనే భావన అతనిలో నిండి వుంటుంది. కొందరు పెద్ద పనులు చేస్తే కొందరు చిన్న పనులు చేస్తారు. ''నాకీ పని చేయాల్సి వచ్చిందే అన్న భావనకు బదులుగా '' ''నా యీ పని వల్ల కుటుంబ సభ్యులకు ఆనందం కలుగుతుది అనే భావనయే అతనిలో వుంటుంది. కుటుంబానికి చెందిన రెండు మహత్త్వపూర్ణకార్యాలైన డబ్బు సంపాదన, ఇంటిని చక్కదిద్దటం - ఈ రెండు పనులను కుటుంబంలోని పురుషులు, స్త్రీలు ఏవిధమైన నిబంధనలు, ఒప్పందాలు లేక స్వయం ప్రేరితులై చేస్తారు. సాధారణంగా పురుషులు డబ్బు సంపాదన కార్యాన్ని నిర్వహిస్తే స్త్రీలు ఇంటిని చక్కదిద్దటం, ధార్మిక సామాజిక కార్యాలని నిర్వహించటం, మొదలైన పనులన్నిటిని ఎంతో నేర్పుగా చేస్తారు. స్త్రీ హృదయం వాత్సల్య భావంతో పరిపూర్ణమై వుంటుంది. శిశు పోషణ ఆమె ఎంతో ఓర్పుతో చేస్తుంది. ఆమె కేవలం తన పిల్లలకే తల్లికాక మొత్తం కుటుంబాన్ని మాతృహృదయంతో చూస్తుంది. స్త్రీ పురుషులిరువురిలో శక్తి వంతులు, శక్తి హీనులు, యోగ్యులు, ఆయోగ్యులు మొదలైన కుటుంబసభ్యులందరిని సమన్వయుపరుస్తూ ఆమె కుటుంబాన్ని చక్కని పద్ధతిలో ముందుకు నడిపిస్తుంది.

## సమిష్టి సంపాదన

భారతీయ కుటుంబాల్లో డబ్బు సంపాదన వ్యక్తిగత సామర్థ్యం, కార్యకౌశల్యం మీద ఆధారపడి వుంటుంది. కాని ఫలితాన్ని అందరు సమానంగానే అనుభవిస్తారు. డబ్బుసంపాదన సామర్థ్యం కుటుంబంలో

అందరికి సమానంగా వుండదు. ఎవరిసామర్ధ్యాన్నిబట్టి వాళ్ళు సంపాదిస్తారు. కాని ఆదాయాన్ని వేరువేరుగా దాచుకోటం వుండదు. ఆదాయమనే పెద్ద పెద్ద నదులు, చిన్న చిన్న కాలవలు, ఒకే ప్రవాహంలో కల్సిపోయి, కుటుంబమనే పొలాన్ని పండిస్తాయి. 'నేనెక్కువ సంపాదిస్తాను' లేక నా భర్త ఆదాయం ఎక్కువ' అనే ఆలోచనే ఎవరికీ రాదు. ''సబ్ మిల్‌త కర్‌కే ఏక్ వర్గ భయి'' అన్న మాటే సార్ధక మవుతుంది. కుటుంబ ఆదాయం అంతా ఒక చోటవుంచి అందరికి సమానంగా రక్షణ పోషణలకోసం ఖర్చుచేయటంలాంటి ఉత్తమ ఆర్ధిక వ్యవస్థ ఏవిధమైన భేదభావం లేని అందరికీ సమాన అభివృద్ధి అవకాశాలను కలిగిస్తుంది. ఈనాటి శక్తి హీనులేరేపు శక్తివంతులై కుటుంబ ఆదాయాన్ని పెంచటంలో ప్రముఖ పాత్ర నిర్వహించగలుగుతారు. కుటుంబవ్యవస్థద్వారా ధనవంతులు ఇంకా ధనవంతులు కావటం, పేదవాళ్ళు ఇంకా ఎక్కువ పేద వాళ్ళు కావటం లాంటి ఆర్ధిక అసమానత్వం నుండి సమాజము, జాతి రక్షించబడతాయి. బలహీనుడి పోషణకూడా అందరితో సమానంగానే జరుగుతుంది. అతను పనిచేసే శక్తి సామర్ధ్యాలు పెరుగుతాయి. అతనుకూడా మనవాడే. మనసమాజంలో విడదీయరాని భాగమే. - ఈ విధమైన భావనయే బలవంతుల మనస్సుల్లో స్వార్ధానికి చోటులేకుండా, బలహీనులను దీనులు కాకుండా చేస్తుంది.

డబ్బు సంపాదించేవ్యక్తి కుటుంబ రక్షణ, పోషణలు జరిపి పొందే సంతృప్తి, సంతోషాల అనుభవాన్నే అతడు ముక్తిమార్గంగా భావిస్తాడు. తన సామర్ధ్యం యొక్క శ్రేష్ఠఫలితాన్ని అతడు కుటుంబంకోసం సమర్పించి తన జీవితం సార్ధకమైందనుకుంటాడు. తాను ఉపకారం చేస్తున్నానని కుటుంబసభ్యులు ఉపకారం పొందుతున్నారన్న భావనయే అతనికి రాదు. భారతీయ జీవనపద్ధతిలో గ్రహీతయే దాతకు ఉపకారం చేస్తున్నాడనే భావన ఇమిడి వుంది. ఈ భావన దాతమనస్సులో జాగ్రుతమైనప్పుడు కుటుంబంకోసం తాను సంపాదించటం ఒక ఉపకారంగా అతడు భావించడు.

## కుటుంబవృత్తులు

భారతీయ సామాజిక ఆర్థిక వ్యవస్థ దృష్టిలో ఇది చాలా మహత్త్వ పూర్ణమైనవిషయం. చిన్నప్పటి నుండే వంశపారంపర్యంగా వచ్చే వృత్తిలో, కుటుంబ వాతావరణంలో వుండి శిక్షణ పొంది వున్నందువల్ల కుటుంబంలోని పిల్లలకు వృత్తికి సంబంధించిన శిక్షణ ప్రత్యేకంగా పొందాల్సిన అవసరంకాని, దాని కోసం సమయంవృథా చేయాల్సిన అవసరం కాని వుండదు. ఈనాటి యువకులు తమ వయస్సులో ఎక్కువభాగం ఏదో ఒక డిగ్రీ సంపాదించటానికే ఖర్చుచేస్తున్నారు తరువాత జీవనోపాధికోసం వెతుకులాటమొదలౌతుంది. తరువాతకూడా తమ శక్తి సామర్థ్యాల సక్రమ వినియోగానికి, అవకాశాలు లభించక పోవటం లేక ఏవో పెద్ద కోరికలు పెట్టుకొని అవి సఫలంకాకపోవటంతో నిరాశా, నిరుత్సాహాలకులోనై ఆత్మహత్యల్లాంటి అవాంఛనీయ సంఘటనలకు లోనుకావడం జరుగుతున్నది. భారతీయ కుటుంబ ఆర్థిక వ్యవస్థలో ఇలాంటి దుష్పరిణామాలు చోటుచేసుకునే అవకాశంలేదు. వంశపారంపర్య వృత్తి వ్యవస్థలో చాలా చిన్న వయస్సులోనే ఎంతో సామర్థ్యం చూపే అవకాశం వుంది.

వంశపారంపర్య వృత్తుల్లో తమ శక్తి సామర్థ్యాలననుసరించి సమయానుకూలంగా, ఇంటి పనులకు భంగంలేకుండా స్త్రీలు కూడా సహాయ పడుతుంటారు. ఎంతో శ్రమతో కూడిన పనులు కూడ వాళ్లుచాలా తేలికగా చేస్తుంటారు. ఉదా: పొలంలో నాట్లు, కోతలు, మొ॥ పనులు వాళ్లు కేవలం చేయటమేకాక పాటలు పాడుతూ ఆనందిస్తూ ఎంతో ఉత్సాహంగా చేస్తారు. వృత్తులు వంశపారంపర్యమైనందువల్ల వాటితో మంచి పరిచయం, అనుభవం కలిగి స్త్రీలు ఆ వృత్తులను స్వయంగా చేయటమే కాక వాటి విషయంలో అవసరమైనప్పుడు ఇతరులకు మార్గదర్శనంకూడా చేస్తారు. ఈ వృత్తులు వంశానుగతంగా, నిరంతరాయంగా కొనసాగుతుంటాయి. కాబట్టి వాటి మీద వాళ్లకు ఒక విధమైన మమత్వ భావన కూడా ఏర్పడి వుంటుంది. వృత్తికి

సంబంధించిన దేవతలను తమ వంశ పూర్వపురుషులను పూజించి నట్లే పూజించటం జరుగుతుంది. ఉదా: బ్రాహ్మణులు బృహస్పతిని, కాయస్థులు చిత్రగుప్తుని, వాస్తు శిల్పులు, ఇతర స్వర్ణకారులు మొదలైనవారు విశ్వకర్మను తమ వంశ పూర్వీకులుగానే భావిస్తారు. ఈ విధమైన ఆత్మీయభావం వాళ్ల వృత్తికి సంబంధించిన నైపుణ్యమెలాంటిదో మనకు తెలియజేస్తుంది. వంశపారంపర్య వృత్తుల్లో నైపుణ్యం చూపినట్లయితే కుటుంబం సుఖ సమృద్ధులతో బాటు జాతికూడా సర్వతోముఖాభివృద్ధి చెందుతుంది. ఈనాటి ఆర్థిక వ్యవస్థ చేస్తున్న మానవ పారిశ్రామికీకరణకు బదులు భారతీయ కుటుంబవ్యవస్థ పరిశ్రమలను వృత్తులను మానవీకరిస్తుంది.

## భూత, భవిష్యత్ వర్తమానాల సమన్వయం

సమిష్టి శక్తి, ఏకత్రిత శక్తి సామర్థ్యాలు, ప్రేమతో మార్గదర్శనం చేసే స్వభావం కేవలం వృత్తికి సంబంధించిన పనుల్లోనే కాక, సుఖ దుఃఖాలకు సంబంధించిన ఏ విషయంలోనైనా, ఏ విధమైన గంభీర సమస్య ఎదురైనా కుటుంబం సంతులనం కోల్పోకుండా వుండేట్లు లేక చిన్న పెద్ద ఎలాంటి సమస్యనైనా ఎదుర్కోగలిగేట్లు చేస్తాయి. సుఖదుఃఖాలను సమానంగా పంచుకొని కుటుంబ సభ్యులు ఆనందానుభూతిని పొందుతారు. బాధ్యతానిర్వహణ, సమస్యల పరిష్కారం వీటి విషయంలో వ్యక్తి ఒంటరివాడు కాకపోవటంవల్ల దుఃఖ పరిమాణం తగ్గి సుఖ పరిమాణం పెరుగుతుంది. మేం విడిచి పెట్టి వెళ్లే వాళ్ళం కాదు, కలుపుకొని వెళ్లే వాళ్లం.

తాత ముత్తాతలతో కూడిన కుటుంబం గౌరవదృష్టితో చూడబడుతుంది. వృద్ధులకు లభించే గౌరవాదరాలు వృద్ధాప్యాన్ని గౌరవప్రదం చేస్తాయి. వృద్ధాప్యం ప్రతిఒక్కరికి సహజంగా వచ్చేదే. వృద్ధాప్యాన్ని భారతీయులు చాలమహత్త్వ పూర్ణమైందిగా, ఉపయోగకరమైందిగా భావించారు. శారీరక శక్తి లేకపోయినా చిన్నపిల్లలకు, శిశువులకు వాళ్లు మంచి ఆధారంగా వుంటారు. యువకులకు

మార్గదర్శనం, ఇంటికి కావలి, ఇరుగు పొరుగువాళ్లకు సలహాలీయడం, శారీరక మానసిక వ్యాధులకు నేర్పుగా శుశ్రూషచేయడం, ఇలాంటి పనులెన్నోచేస్తూతమ జీవితాన్ని ఎంతో ఉపయోగకరంగా మల్చుకొని వృద్ధులు కుటుంబానికి పెద్ద ఆధారంగా వుంటారు. కుటుంబం గురించి భారతీయులు ఆలోచించిన పద్ధతిని బట్టి చూస్తే భారతీయ జీవన పద్ధతిలో అధమ శ్రేణికి చెందిన వృద్ధాశ్రమల్లాంటి (old aged homes) వాటికి స్థానం లేదు. తాత, బామ్మలువుండే కుటుంబంలో తల్లిదండ్రులకు ఎంతో మనశ్శాంతి లభిస్తుంది. పిల్లల సంరక్షణ, వాళ్లను సంస్కారవంతులుగా తీర్చిదిద్దటం మొదలగు పనులను వాళ్లు సహజంగానే చేస్తుంటారు. అమ్మమ్మ, నాయనమ్మలు చెప్పే కథలు చిరకాలం మానసికోల్లాసం కల్గించడంతోపాటు చక్కని మార్గదర్శనం కూడా చేస్తాయి. పిల్లల కేరింతలు, ఉత్సాహంతో కూడిన వాళ్లచిలిపి చేష్టలు, వీటిల్లో పాల్గొంటూ వృద్ధతరం తమజీవిత సంధ్యాకాలంలో కూడ సూర్యోదయ సమయంలో కలిగే స్ఫూర్తిని, ఉత్సాహాన్ని పొందుతారు. కుటుంబంలో వృద్ధులకు జరిగే షష్ఠిపూర్తి, అమృతోత్సవంలాంటి కార్యక్రమాలను భారతీయ కుటుంబాలు పెద్దపండగలుగా భావిస్తాయి. వృద్ధాప్యంలో లభించే ఇలాంటి స్ఫూర్తి, ఉత్సాహంకారణంగా వాళ్లకు మృత్యుభయం కూడ వుండదు. ఇంతేగాదు, మృత్యువుకూడ శుభప్రదంగా మారిపోతుంది.

తల్లిదండ్రులకు, పిల్లలకు ఉత్తమ సంస్కారాలెవరిస్తారు? సుఖదుఃఖాలను గురించి ఎవరాలోచిస్తారు? అనే విషయాల చింత వాళ్లకు ఈ పెద్దల కారణంగా వుండదు. తమ భవిష్యత్తరానికి చెందిన పిల్లలను, వాళ్లమీది సంపూర్ణవిశ్వాసంతో తమ కంటే ముందుతరానికి చెందిన వృద్ధులకు ఒప్పగించి తల్లిదండ్రులు నిశ్చింతులై తమ వర్తమానాన్ని సుసంపన్నం చేసుకోటానికి పూనుకుంటారు. దీనికారణంగా చిన్నపిల్లలు తమకుటుంబకార్యాల్లో నిమగ్నులైవుంటే తల్లిదండ్రుల ప్రేమనుండి వంచితులు కారు. వృద్ధుల ఒడినుండే వాళ్లకలాంటి ప్రేమ, మమకారాలు లభిస్తాయి. దేశానికి భవిష్యత్తు నాయకులను అనుభవజ్ఞులైన

వృద్ధులు ఎంతో నైపుణ్యంతో సంస్కరించి శ్రేష్ఠము, ఉజ్జ్వలమునైన దేశపరంపరను శక్తివంతం చేస్తారు. ఈ విధంగా భూత, భవిష్యత్ వర్తమానాల చక్కని సమన్వయం భారతీయకుటుంబం. అక్కడ గౌరవాదరాలు కల్గిన వృద్ధులు, కర్తవ్యనిష్ఠులైన యువకులకు ఆధారంగా నిలుస్తూ సుందరమైన, శుభప్రదమైన, కర్తృత్వ సంపన్నమైన భవిష్యత్తును నిర్మిస్తారు. ఇలాంటి కుటుంబాల్లో వృద్ధాప్యం అభావత్వ, అసంతోష అనాదరణాల భయంకర జ్వాలల్లో కుమిలిపోతూ వుండదు. వాళ్ల వర్తమానం అకర్మణ్య, అపరాధ, అనురాగ భావాలతో నిండి వుండదు. భవిష్యత్తు అనిశ్చయం, అభద్రత, అన్యాయ భావాలతో పీడింపబడదు. ఇక్కడ ఆదర్శం, వాస్తవికత, అపేక్షల సంతులిత సమన్వయం వుంటుంది.

## సంకుచితం కాదు, విస్తృతం

ఇలాంటి ఆనందోత్సాహాలతో కూడిన కుటుంబాన్ని భారతీయులు సంకుచితమైందిగా భావించలేదు. భారతీయ కుటుంబపరిధి చాల విస్తృతమైంది. బంధుత్వాన్ని తెలియజేసే పదాలు మన దగ్గరున్నన్ని ప్రపంచంలో మరెక్కడా లేవు. ఈ పదాలు ఇదివరకొకసారి ఈ వ్యాసంలో పేర్కొనబడ్డాయి. మేటర్నల్ (తల్లివైపు), పేటర్నల్ (తండ్రివైపు) లాంటి ఇంగ్లీషు విశ్లేషణ పదాలు ఉపయోగించాల్సిన అవసరం మనకు లేదు. ప్రతి బంధుత్వానికి ఒక నిశ్చితపదం మనకుంది. కుటుంబంలో కేవలం బంధువులే కాక సేవకులు, సేవికలు మొ. వాళ్లుకూడ కుటుంబసభ్యులుగానే భావించబడతారు. రామ పేరుగల సేవకుణ్ణి రామన్న అని లక్ష్మి పేరుగల సేవకురాలిని లక్ష్మమ్మ అని పిలుస్తుంటారు. ఇరుగు పొరుగు కుటుంబాలకు చెందిన వాళ్లుకూడ మన కుటుంబ సభ్యులుగానే భావించబడుతుంటారు.

కుటుంబానికి తరచు సహాయపడుతుండే వైద్యులు, ఉపాధ్యాయులు, దర్జీలు, స్వర్ణకారులు, కమ్మర్లు మొదలగు వాళ్లందరికీ ఆ కుటుంబానికి మధ్య

స్నేహ సంబంధం వుంటుంది. కుటుంబాల్లో జరిగే వివాహాది శుభకార్యాల్లో చాకలి, మంగలి కుమ్మరి మొదలగు వాళ్లందరు ప్రేమతో తమకు రావల్సిన ప్రతిఫలం తీసుకుని ఆయా కుటుంబాలతో తమకుండే అనుబంధాన్ని చాటుకుంటారు. మగ శిశువు పుట్టిన ఇంటికి కొజ్జాలు వచ్చి ఆటలాడి, పాటలు పాడి డబ్బులడుక్కునే పద్ధతికూడ సమాజంలో అన్నివర్గాల ప్రజల మధ్య భావాత్మక సమైక్యత నెలకొల్పివుంచాలనే భారతీయుల ఆలోచనా విధానాన్నే తెలియజేస్తుంది.

ఆకాశంలోని మహోన్నతశక్తులు మొదలుకొని భూమికన్నాల్లో వుండే చిన్నప్రాణులవరకు మన కుటుంబ సంబంధాలు వ్యాపించివున్నాయి. చందమామ, సూర్యత్త, విద్యుత్‌రాణి, ఇలాంటి పేర్లతో మనం వాటితో మనకుండే అనుబంధాన్నే తెలియజేస్తాం. అదేవిధంగా గోవును మాతయని పిల్లి, కుక్కలను ఏవేవో ముద్దుపేర్లు పెట్టుకొని పిలుస్తుంటాం. నాగుల చవితి, నాగ పంచమిలాంటి పర్వదినాల్లో పాములకు పాలుపోసి పూజించటం ద్వారా పాతాళలోకంతో మనం సంబంధా నేర్పరచుకుంటున్నాం. వామనుడి మూడుపాదాలవలె మన ఆత్మీయతాభావం మూడు లోకాలకు వ్యాపించింది. అదేవిధంగా నదులు, పర్వతాలు,చెట్లు, అన్నిటితో ఇలాంటి సంబంధమే, మనకుంది. ఈ విధంగా ఆటపాటలద్వారా విశ్వబంధుత్వ భావనను నిర్మించి, సంపూర్ణ బ్రహ్మాండంతో ఆత్మీయభావనను కల్గించి మానవోత్తముడిగా తీర్చిదిద్దే సులభోపాయాన్ని భారతీయులు మనముందుంచారు. ఈ విధమైన ఆత్మీయభావన స్థిరంగా నిలిచివుండాలనే భావనయే స్వార్థం, ఇతర చెడుగుణాలమీద అంకుశంగా పని చేస్తుంది.

కేవలం సంబంధ, సంబోధనల్లోనేకాక మన వ్యవహారంలో, కార్య కలాపాల్లోకూడ విశ్వబంధుత్వ భావన నిండివుంది. పంచ భోక్తలు అంటే అగ్ని, అతిథి, అభ్యాగతి, గోవు, కుక్క, చీమ ఈ ఐదింటికి మన భోజనంలో కొంతభాగం తప్పకుండా సమర్పిస్తూ ''ఆత్మవత్ సర్వభూతేషు''

అన్నవిషయాన్ని ఎప్పుడూ గుర్తుంచుకుంటాం. సంబంధ, సంబోధనలు నెరపే ఈ ప్రవృత్తిద్వారా అహింస, ప్రేమ, దయ,మొ. ఉదాత్త గుణాలు సహజంగానే అభివృద్ధి చెందుతాయి. శిశుప్రాయంనుండే అందరిని ప్రేమతో చూసే చక్కని స్వభావం ఏర్పడుతుంది. వయస్సుతోపాటు ఆ గుణమే ఇంకా వృద్ధిచెంది వ్యక్తిలో ఓర్పు, వివేకం, విశాలభావం మొదలైన మరిన్ని సద్గుణాలను నిర్మిస్తుంది.

పరస్పరం వ్యక్తుల మధ్య వుండే వ్యతిరేక భావాలు కూడ కుటుంబభావనతో అనుకూలంగా మారిపోతాయి

భారతీయ కుటుంబానికి శివుని కుటుంబం ఆదర్శం. శివుడు పార్వతీ దేవికి తన సగం శరీరాన్నిచ్చాడు. భర్త శక్తిసామర్థ్యాలు, ఆలోచనా శక్తి, మహోన్నత విజయాలు, ధర్మం, పుణ్యం వీటన్నిటిమీద సహధర్మచారిణియైన అర్ధాంగికి సంపూర్ణ భాగస్వామ్యం ఉంటుంది. శివుని కుమారుల్లో ఒకడు షణ్ముఖుడైతే మరొకడు గజాననుడు. శివుని వాహనం ఎద్దు, పార్వతీ వాహనం సింహం, గజాననుడి వాహనం ఎలుక. షణ్ముఖుని వాహనం నెమలి. జాతిగతంగా చూస్తే పరస్పరం అందరి మధ్య శత్రుత్వమే. సింహం ఎద్దును తినాలని, పాము ఎలుకని తినాలని, నెమిలి పామును తినాలని చూస్తుంటాయి. ఐనప్పటికి శివుని కుటుంబంలో అన్నీ వైయక్తిక జాతిగత శత్రుత్వాన్ని వదలి, ఒకే మనస్సు ఒకే ప్రాణం కల్గి విశ్వకల్యాణ కార్యంలో నిమగ్నమై వున్నాయి. ఇలా జర్గటంలో ఆశ్చర్యం లేదు. స్వయంగా విషపానం చేసి లోకానికి అమృత పానం చేయించే దేవాధిదేవుడైన మహాదేవుడితోపాటు ఒకే కుటుంబంలో వుంటున్నప్పుడు శత్రుత్వ వైమనస్యాల విషం ఇక వుండలేదు. ఆ విషపానం చేసిన శంకరుని ఛత్ర ఛాయల్లో అన్ని విషధరాలు విషహరాలైపోయాయి. పై భావమే ఈ క్రింది శ్లోకంలో చక్కగా వర్ణించబడింది.

*రుద్రో ముండధరో భుజంగ సహితో గౌరీతు సద్భూషణా*
*స్కంధః శంభుసుతః షడాననయుతో తుండీచ లంబోదరః*

సింహ, క్రీలిమ, మూషికంచ, వృషభస్తేషాం నిజం వాహనం
ఇత్థం శంభుగృహే విభిన్నమతిషు చైక్యం సదావర్తతే ॥

భారతీయ కుటుంబ పరిధి చాల విశాలమైంది కాబట్టి దాని యందుండే నిష్ఠ కారణంగా ఏదైనా కుటుంబకార్యం చేయాల్సివచ్చినప్పుడు అల్ప పరిధికల వైయక్తిక కోరికలు కుటుంబసభ్యుల దృష్టికిరావు. తన పనులు కుటుంబపనులే కాబట్టి అతడు వాటిని మర్చిపోతాడు. కుటుంబానికి హాని కల్గించే తన సహజస్వభావాన్ని అతను కుటుంబశ్రేయస్సుకోసం పూర్తిగా మార్చుకుంటాడు. భారతీయ కుటుంబంలో వ్యక్తుల మధ్యవుండే పరస్పర వ్యతిరేక స్వభావాలు కూడా పరస్పరానుకూలము, సుఖదాయకము, సర్వపోషకముగా మారిపోతాయి. ఇలాంటి మార్పును కొందరు వ్యక్తులు స్వయంగా ఆలోచించి ప్రయత్నపూర్వకంగా తెచ్చుకుంటే, కొందరు ఇతరులను చూసి లేక వాళ్ల ప్రభావంతో తెచ్చుకుంటారు. శ్రీరాముని సౌమ్య, శాంత స్వభావం లక్ష్మణుని తీవ్ర స్వభావాన్ని నియంత్రించింది. భరతుని సహిష్ణుత శతృఘ్నుడికి వివేకాన్ని కలిగించింది. ఉదాత్తము వివేకవంతమునైన ద్రౌపది నమ్రత ధృతరాష్ట్రుడ్ని తలవంచుకునేట్లు చేసింది. ఆమెలోని భారతీయ స్త్రీత్వ గుణమే శ్రీ కృష్ణుడ్ని ఆమెకు సఖుడుగా చేసింది. ధర్మరాజు రాజ్యంలో ప్రచండమైన భీముని బలం లోకోపకారం కోసమే ఉపయోగపడింది.

''స్వభావో దురతిక్రమః'' అని చెప్పబడింది.

కాని అసాధ్యాన్ని కూడ సాధ్యం చేయగల శక్తి భారతీయ కుటుంబమనే పరుసవేదిలో వుంది. దాని స్పర్శమాత్రంతోనే కుటుంబసభ్యుని 'అహం' 'వయం'గా మారిపోతుంది. 'పంచ', 'శతం' కలిసి పంచాధిక శతం అవుతాయి.

భారతీయ మేధావులద్వారా ఇంత దృఢము, స్థిరము, విశాలమునైన వ్యవస్థ నిర్మించబడింది. దీనికి ప్రపంచంలో మరెక్కడా సాటిలేదు. ప్రపంచానికి భారతదేశం ఇచ్చిన గొప్పవరం ఇది. ఈనాడు ప్రపంచంలో ఛిన్నాభిన్నమైన

కుటుంబవ్యవస్థ ద్వారా శారీరక, మానసిక, సంక్షోభంలో మునిగివున్న సమాజాలు భారతీయ కుటుంబవ్యవస్థను స్వీకరిచటంద్వారానే ఉద్ధరింపబడి శారీరక మానసిక సుఖశాంతులను పొందగల్గుతాయి. పాశ్చాత్య నాగరికతా వ్యామోహానికి గురవుతున్న భారతీయ సమాజానికి ప్రపంచానికి కూడా ఈ వ్యవస్థ ద్వారానే మేలుకల్గుతుంది.

## దేశవ్యాప్తమైన ఆదర్శం

కుటుంబ సభ్యులందరికీ చక్కని మనశ్శాంతిని ప్రసాదించే భారతీయ కుటుంబ స్వరూపం ఎంతో అద్భుతమైంది. స్వార్థము, హక్కులకు బదులు త్యాగ కర్తవ్య భావాలను ప్రతి వ్యక్తిలో నిర్మాణం చేసే మన సంస్కృతి ప్రభావంవల్ల భారతీయ కుటుంబాలన్నీ ఇలాంటి జీవితాన్నే గడుపుతున్నాయనిగాని, లేక గడుపుతుండేవనిగాని చెప్పటం భావ్యంకాదు. కాని ఇలాంటి ఆదర్శకుటుంబాలు, అన్ని గ్రామాల్లో, అన్ని కులాల్లో, వివిధ భాషలు మాట్లాడే వాళ్లలో, అడవుల్లో ఈవిధంగా మొత్తం దేశంలో అధిక సంఖ్యలోనే వుండేవని మాత్రం చెప్పవచ్చు. దీనికారణంగా భారతీయులందరు ఆదర్శకుటుంబ మంటే ఎలా వుంటుందో ప్రత్యక్షంగా చూడగల్గి వుండేవాళ్ళు. ఇంతేకాక ఆకుటుంబ సభ్యుల సౌహార్ద్ర పూర్ణమైన పరస్పర సంబంధాల అనుభూతిని కూడ వాళ్ళు పొందగలిగే వాళ్ళు. ఇలాంటి కుటుంబాలే భారతీయులందరికి ఎంతో ఆదర్శప్రాయంగా వుండి తమ కుటుంబాలను ఆవిధంగానే తీర్చిదిద్దుకోవాలనే ప్రేరణ నివ్వటంతోపాటు తమ నిజజీవితంలో ఎదురయ్యే అనేక సమస్యల పరిష్కారానికి కూడ అవి మార్గదర్శకంగా వుండేవి.

## సుదీర్ఘమైన కుటుంబ జీవనం

సౌహార్ద్ర పూర్ణమైన ఇలాంటి భారతీయ కుటంబజీవనం సుదీర్ఘకాలం నుండి, ఎలాంటి ఒడిదొడుకులు లేకుండా కొనసాగుతూ వస్తున్నది.

అత్తవారింటికి వచ్చిన కొత్త కోడలు ప్రాముఖ్యతను గురించి వేదాల్లో ఎలా వర్ణించబడిందో ఇదివరకే పేర్కొనబడింది. దీనివల్ల వేదకాలంలో కూడ ఇలాంటి కుటుంబాలుండేవని మనకు తెలుస్తుంది. పురాతత్త్వ శాస్త్రజ్ఞులు భారతీయ సమాజ జీవనం ఇంత ప్రాచీనమైందన్న విషయం ఇంతకు ముందు నమ్మేవాళ్ళు కాదు. కాని అమెరికాలోని అట్లాంటా నగరంలో 1996 అక్టోబర్ 4.5.6 తేదీల్లో జరిగిన అంతర్జాతీయ సమ్మేళనంలో 300 మంది పండితులు పురాతత్త్వ పరిశోధనల ప్రకారం భారతదేశంలో భారతీయుల సామాజిక జీవనం కనీసం గత 6వేల సంవత్సరాల నుండి ఎలాంటి ఒడిదొడుకులు లేకుండా కొనసాగుతూ వస్తున్నదని, ఆర్యులు భారతదేశం మీద దండయాత్ర జరిపారనే వాదన నిజంకాదని'' తీర్మానించారు. హైద్రాబాద్‌లో 1991లో జరిగిన అంతర్జాతీయ ఖగోళశాస్త్రజ్ఞుల సమ్మేళనంలో వాళ్ళు వేదకాలం ఇప్పటికి 6000 సంవత్సరాలకు పూర్వపుదని పేర్కొన్నారు. దీన్ని బట్టి కుటుంబజీవనంలో సౌహార్ద్ర పూర్ణ వాతావరణాన్ని నిలిపివుంచటంలో, నిజజీవితంలో ఎదురయ్యే అనేక సమస్యలను పరిష్కరించటంలో భారతీయులు సుదీర్ఘకాలంనుండి విజయవంతులవుతూ వచ్చారని స్పష్టమవుతుంది.

## అంతులేని శారీరక పరిశ్రమ

వేల సంవత్సరాల ప్రాచీన కాలపుమన ప్రజలు సంఘటిత శారీరక బౌద్ధిక కృషిచాల చేశారు. సంపూర్ణమానవ సమాజంతోకూడిన ఈసృష్టికార్యం సరియైన పద్ధతిలో నడవటానికి మొదలు సృష్టి అంటే ఏమిటో తెల్సుకోటానికి వాళ్లు చాలలోతుగా అధ్యయనం చేశారు. తర్వాత ఆసృష్టిలో మానవుడికున్న స్థానం, తర్వాత మానవుడంటే మనస్సు, బుద్ధి, ఆత్మలతో కూడిన శరీరధారి యనే విషయం, అంతరాత్మ, మానవజీవితలక్ష్యం, మానవ మనస్సు, ఈ మనస్సుకు అవసరమైన సంస్కారాలు, సమాజంలో చివరి వ్యక్తి వరకు ఈ సంస్కారాలను అందించే వ్యవస్థ, ఈ మొత్తం విషయాల గురించి ఎందరో మన

మేధావులు ఏకాభిప్రాయంతో నిర్ణయాలు చేశారు. వీటిని ఆచరణలోనికి తేవటానికి వీటియందు శ్రద్ధకలిగి, ఈ పనిచేయాలనే పట్టుదలతో కష్టపడటానికి ముందుకు వచ్చే వ్యక్తులతో కూడిన ఒక విశాల సంఘటనను కూడ వాళ్లు నిర్మాణంచేశారు. దీనిద్వారా తరతరాలుగా కొత్త కార్యకర్తలు నిర్మాణమవుతూ అనేక తరాల వరకు ఈ సంఘటన నిరంతరాయంగా కొనసాగుతుండే ఏర్పాటు జరిగింది. కాబట్టి భారతీయ కుటుంబం అతి ప్రాచీన కాలంనుండి నేటి వరకు కొనసాగుతూ వచ్చింది. సృష్టిని గురించి సరియైన అధ్యయనం జరగటానికి, ఇతర విషయాల అధ్యయనం గురించి ఒక్కొక్క అధ్యయన కర్తకు ఎంత సమయం పట్టివుంటుంది? ఎంత మంది అధ్యయనం చేశారు? వ్యక్తిగత అహంకారానికి చోటీయక, సమాజ కల్యాణకోసం వాళ్లందరు ఏకాభిప్రాయానికి ఎలావచ్చారు? ఏకాభిప్రాయానికి వచ్చిన తర్వాత ప్రతి ఒక్కరు తమ జీవితంలో ఎంత సమయమిచ్చి ఈ కార్యం చేశారు? దీని ద్వారా ఎలా అసంఖ్యాక సంస్కారవంతులను నిర్మాణం చేశారు? ఈ మొదలైన విషయాలన్ని ఆలోచనా పరులకు తేలికగానే అర్థమవుతాయి.

## మనస్సుకు సంస్కారాన్నిచ్చే పని

మానవుడ్ని పశుత్వం నుండి మానవత్వానికి, మానవత్వం నుండి దేవత్వానికి గొనిపోవటానికి అవసరమైన సత్య, అహింస, శాంతి, క్షమ, ఇంద్రియ నిగ్రహం, మొదలగు గుణాలకు సంబంధించిన సంస్కారాలను సమాజంలో నిర్మాణం చేయాలని ప్రాచీన భారతీయులు నిర్ణయించారు. ఇవి వాళ్ళ ద్వారానే నిర్మాణం కాగలుగుతాయి. భోగప్రవృత్తిని ప్రోత్సహించటం చాల సులభం. మనోనిగ్రహమే కష్టం. ప్రపంచ మానవులందర్ని భోగ ప్రవృత్తిని ప్రోత్సహించటం చాల సులభం. మనోనిగ్రహమే కష్టం. ప్రపంచ మానవులందరిలో భోగ ప్రవృత్తులుగా చేసే కార్యాన్ని గత 100-200 సంవత్సరాల నుండి పాశ్చాత్యులు చేస్తున్నారు. ప్రతి వ్యక్తికి మనోనిగ్రహం అలవాటు చేయాలని భారతీయుల ఉద్దేశం. ఇది చాల కష్టమైన

పనేకాని మానవజీవితం, సంపూర్ణ సృష్టి సక్రమంగా నడవటానికి అదే ఉపయోగపడుతుంది. భారతీయుల సుదీర్ఘకాల, సుఖ శాంతి పూర్వక కుటుంబ జీవనమే ఇందుకు నిదర్శనం. రా.స్వ.సం. కార్యాన్ని చూసినట్లయితే ఈ పని ఎంత కష్టమైందో మన కర్థమవుతుంది. హిందూదేశంలో తగినంత మంది దేశభక్తుల సంఘటన నిర్మాణం కోసం నగరాల్లో 3%, గ్రామాల్లో 1% సంఖ్య నిర్మాణం కావాలనే లక్ష్యాన్ని సంఘస్థాపకులు డా॥ హెడ్గేవార్‌గారు స్వయంసేవకులముందుంచారు. 71 సంవత్సరాలనుండి సంఘ కార్యం నడుస్తున్నా ఆలక్ష్యం ఇంకా చాల దూరంలోనే వుంది. గుణాత్మకంగా, సంఖ్యాపరంగా భారత దేశంలో ఇది అన్నిటికంటె ఉత్తమ సంఘటనయని ప్రజలనుకుంటారు. కాని లక్ష్యాన్ని మాత్రం ఇంకా చేరుకోలేదు. అసంఖ్యాకంగా ప్రయత్నాలు జరుగుతున్నా అది ఇంకా నెరవేరలేదు. ప్రాచీన భారతీయులు సంస్కార నిర్మాణ కార్యాన్ని చేయటంలో ఎన్ని కష్టాలనుభవించారో దీన్నిబట్టి తెలుస్తుంది. మానవ కల్యాణం కోసం అలాంటి కష్టమైన పనిచేయటం అవసరమని వాళ్లకు దృఢ విశ్వాసం వుండబట్టే వాళ్ళా పని చేసి చిరకాలం నిలవగలిగిన చక్కని కుటుంబ వ్యవస్థను నిర్మించగలిగారు.

## వ్యవస్థకు ఏర్పడిన కొద్ది ప్రమాదం

గత 100-125 సంవత్సరాల నుండి భారతీయ కుటుంబ వ్యవస్థకు కొంచెం దెబ్బతగిలింది. గట్టి పునాది మీద సుదీర్ఘకాలం నిలిచివున్న ఈ కుటుంబవ్యవస్థ ఇంతవరకు అనేక విదేశీ ఆక్రమణలను ఎదుర్కొని స్థిరంగా నిలిచివుంది. ప్రస్తుతం తగులుతున్న ఈ దెబ్బను కూడ భారతీయులు సులభంగానే ఎదుర్కోగలరని వేల సంవత్సరాల భారతీయుల చరిత్రను, అనుభవాన్ని బట్టి చూస్తే తెలుస్తుంది. పాశ్చాత్యుల సామ్రాజ్య నిర్మితి, వైజ్ఞానిక, సాంకేతిక రంగాల్లో సాధించిన ప్రగతి వీటి ప్రభావానికిలోనైన భారతీయులు కొంచెం దారి తప్పారు. దీనివల్ల వాళ్ల కుటుంబవ్యవస్థ కొంచెం శిథిలమైన మాట

నిజమే. చాలా మంది భారతీయులు పాశ్చాత్యుల భోగ సంస్కృతి ప్రభావానికిలోనై కొందరు భారతీయులు చెడిపోవటం చూసి అనవసరంగా ఎక్కువ భయపడుతూ ఇది కలియుగ ప్రభావమని, అంతా సర్వనాశనానికే వచ్చిందని అతిశయ వర్ణనలు చేస్తున్నారు. కాని ఈ విధంగా భయపడాల్సిన అవసరం ఎంత మాత్రం లేదు. భారతీయుల్లో భారతీయ సంస్కృతి ఎంత దృఢంగా నాటుకొని వుందో తెల్సిన మేధావులే ఈ విషయం చెప్పగలుగుతారు. శరీరం మీద ఎక్కడైనా కొద్దిగా పుండైతే అది మధుమేహ సంబంధం కాదని కొద్దిగా మందు వాడితే తగ్గిపోతుందని చదువుకున్న వైద్యుడే చెప్పగలడు. చిన్న పుండును చూసే వాళ్ళు భయపడిపోరు. ''సుఖ భోగవాంఛ అనుభవించిన కొద్దీ పెరుగుతుందే కాని తరగదని చివరకది వాళ్ళనే నాశనం చేస్తుందన్న ఆలోచన పాశ్చాత్య భోగసంస్కృతిని అనుసరించే భారతీయుల మనస్సులకు అనేక వేల సంవత్సరాలనుంచి ప్రభావితం చేస్తూనే వుంది. అందువల్ల ఈ పాశ్చాత్య సంస్కృత్యనుకరణను వాళ్లు త్వరలోనే విడిచి పెడతారు. భారతీయుల్లో అలాంటి ప్రయత్నాలు ప్రారంభమైనాయి. అశ్లీల వ్యాపార ప్రకటనలను వ్యతిరేకించే స్త్రీలను మనం చూసినప్పుడు భారతీయ సంస్కృతి సంస్కారం వాళ్ల మనస్సుల మీద ఎంత దృఢంగా నాటుకొని వుందో మనకు తెలుస్తుంది. ఇలాంటి ప్రయత్నాలనేకం ఈనాడు భారతదేశంలో జరుగుతున్నాయి.

## పాశ్చాత్య జీవనంలో జరిగిన సంఘటనలద్వారా నీతి

''పాశ్చాత్యుల భోగవాద, వ్యక్తినిష్ఠ సామాజిక జీవన సంఘటనలు ''భోగవాంఛ, భోగులను ముంచేస్తుంది, భోగవాద సంస్కృతికి దూరంగా వుండిడి'' అని గత కొన్ని దశాబ్దాలుగా మొత్తం ప్రపంచాన్ని హెచ్చరిస్తున్నాయి. సమయం గడిచిన కొద్దీ ఈ హెచ్చరిక ఇంకా ఎక్కువ ప్రభావశాలి అవుతున్నది.

భారతీయులవలె ఏకాత్మకమైన సంపూర్ణసృష్టి యొక్క మూలాన్ని గురించి అధ్యయనం చేసిదానిపై ఆధారపడిన కుటుంబజీవన వ్యవస్థను

పాశ్చాత్యులు స్వీకరించలేదు. వాళ్ళ సంపూర్ణ జీవన కాలము 500 - 700 సంవత్సరాలు. సాంస్కృతికంగా ఇంకా ప్రాథమికావస్థలో వున్నప్పుడే క్రైస్తవమత ప్రభావం వాళ్ళ సమాజాలమీద పడింది. దాని కారణంగా వాళ్ళ మనస్సుల్లో పాపపుణ్యాలకు సంబంధించిన కొన్ని ఊహలు చోటుచేసుకున్నాయి. 15,16 శతాబ్దాల్లో వాళ్ళు సెక్యులరిజంను గ్రహించినప్పుడు వాళ్ళ మనస్సులో వున్న ఈ పాపపుణ్య ఆలోచనలు దూరమైపోయి క్రమంగా సెక్యులరిజం ప్రభావం బాగా పెరిగి వ్యక్తి నిష్ఠ భోగవాద ఆలోచనలు ఎక్కువైనాయి. దీనికారణంగా వాళ్లల్లో అంతకుముందు ఏదోకొద్దిగావున్న కుటుంబవ్యవస్థ సాంతం శిథిలమై పోవటం మొదలైంది. వ్యక్తి భోగ వాంఛలమీద అంతకుముందుండే సామాజిక కట్టుబాట్లు కూడా తొలగిపోయి విశృంఖల భోగవాంఛలకు దారితీసింది. వివాహమంటే భోగవాసనలకు అనుమతి అని అర్థం గ్రహించబడింది. వివాహంకాగానే హానీమూన్ అంటే మిగతా కుటుంబాన్ని వదిలి విశృంఖలంగా వ్యవహరించడానికి స్వేచ్ఛ లభించటం అని భావించబడింది. తమ విశృంఖల విహారంలో ఈ కుటుంబం అడ్డంకిగా వుంది అనే ఆలోచన అప్పుడే మొదలైంది. విశాల కుటుంబ బాధ్యతల నుండి వ్యక్తి తప్పుకోవటం మొదలుపెట్టాడు. నా తల్లిదండ్రుల భోగవాసన కారణంగానే నేను పుట్టాను. అందువల్ల వాళ్ళపట్ల నాకేవిధమైన బాధ్యతలేదు' అనే ఆలోచన పెరిగిపోయి అనేక వృద్ధాశ్రమాల నిర్మాణానికి దారితీసింది.

వివాహానికి పూర్వం భోగవాంఛను నిగ్రహించటం కష్టమైపోయి Condomn లాంటి సాధనాలను ఉపయోగించి, వివాహానికి ముందే శృంగార క్రియలు జరగటం మొదలైంది. భ్రూణహత్య పాపం కాదని చట్టాలు చేయబడ్డాయి. బెంగుళూరు నివాసి, విద్యావిషయక శాస్త్రవేత్త, సమాజసేవికయైన శ్రీమతి రుక్మిణి అనే ఆమె తనకు కలిగిన ఒక అనుభవాన్ని ఇలా తెలియజేసింది. ఆమె స్నేహితురాలు ఒకామె అమెరికా వెళ్ళింది. అక్కడొక విద్యాలయాన్ని చూడటానికి వెళ్ళి ఒక గదిలో చాలా మంది శిశువులు

ఉయ్యాలల్లో పడుకొని వుండటం చూసింది. వాళ్ళంతా ఆ విద్యాలయంలో చదివే అవివాహిత స్త్రీల శిశువులని ఆమెకు తెల్సింది. గర్భధారణను నిరోధించే అనేక సాధనాలక్కడ వున్నాయి. భ్రూణహత్య పాపం కాదని అక్కడ భావించబడుతుంది. ఐనప్పటికి అవివాహిత స్త్రీల సంతానాన్ని సంరక్షించాల్సిన బాధ్యతను అక్కడి విద్యాలయాలు వహిస్తున్నాయి. వ్యక్తి నిష్ఠ, భోగవాద సంస్కృతి ప్రభావం కారణంగా అక్కడ విడాకుల సంఖ్య రోజురోజుకు పెరిగి పోతున్నది. కొన్ని దేశాల్లోనైతే ఇది 50% దాకా వుంది. విడాకుల కారణంగా అనాధ శిశువుల సంఖ్యకూడా పెరిగిపోతున్నది. వివాహానికి పూర్వం కలుగుతున్న సంతానాల సంఖ్య కూడా బాగా పెరిగిపోయింది. మాతాపితృ విహీన సంతానం వల్ల అక్కడి సమాజ జీవనంలో అత్యాచారం, రక్తపాతం, దొంగతనం మొదలైన అనేక సమస్యలు నిర్మాణమవుతున్నాయి. భౌతిక దృష్టితో చూస్తే అక్కడి సమాజం చాలా సుఖ సమృద్ధమైంది. అన్నిరకాల సుఖసాధనాలు అక్కడ అందుబాటులో వున్నాయి. ఐనప్పటికీ కుటుంబ విషయానికి సంబంధించిన నైతిక విలువలు అక్కడ ఏమాత్రంలేవు. విశృంఖల భోగవాంఛ కారణంగా అక్కడ వ్యక్తి అసంతృప్తితో బాధపడుతున్నాడు. వివాహం, లేక విడాకుల్లాంటి జంఝాటంలో పడకుండా వీలైనంత ఎక్కువ సమయం ఒంటరిగానే వుండటం లేక 15, 20 రోజులు స్త్రీ పురుషులు కలిసి ఉండటం లాంటి సంఘటనలు ఎక్కువగా జరుగుతున్నాయి. అంటే పశుప్రాయమైన సంభోగం కోసం ఇలా స్త్రీ పురుషులు కలుస్తున్నారని తెలుసుకోవాలి.

## దారితప్పిన పాశ్చాత్య ఆర్థిక వ్యవస్థ

పాశ్చాత్య సమాజం చాలా వేగంగా పైన పేర్కొనబడిన విధంగా దారి తప్పిపోతున్నది. కుటుంబ ఆధారంలేని అనాధుల సంఖ్య అక్కడి సమాజంలో పెరిగిపోతున్నది. వృద్ధులు, వికలాంగులు తమ శారీరక బలహీనత కారణంగా అనాధులై వున్నారు. ఉద్యోగం లేక ఏదైనా జీవనోపాధి దొరకని కారణంగా

యువతరం కూడా అనాధ ఐంది. తల్లిదండ్రులు వుండుకుండా వాళ్లతో సంబంధంలేని పిల్లలుకూడా అనాధలైనారు. పాశ్చాత్యులు తమ సమాజవ్యవస్థలో రాజ్యానికి (State) అన్ని రకాల బాధ్యతలను ఒప్పగించారు. అందువల్ల ఈ అనాధులందరికీ ఆశ్రయం కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వం మీదనే వుంది. ఇదివరకు చెప్పబడినట్లు అవివాహిత విద్యార్థినుల సంతాన సంరక్షణ బాధ్యత ప్రభుత్వ సహాయంతో వాళ్ళు చదువుతున్న విద్యాలయాలే వహిస్తున్నాయి. ఇంకా అనేక రకాల అనాధల సంరక్షణ కోసం అక్కడి ఈ ప్రభుత్వాలు చాలా పెద్ద మొత్తంలో డబ్బుఖర్చు చేస్తున్నాయి. ఇంగ్లాండులో ఈ ఖర్చు రోజురోజుకు ఎంత పెరుగుతున్నదంటే కొన్నాళ్ళుపోతే మొత్తం బడ్జెట్ దానికోసం ఖర్చు చేయాల్సివస్తుందని దేశంలో మిగిలిన వ్యవస్థంతా శిథిలమైపోతుందని ఇంగ్లాండునుంచి వచ్చిన ఒక వ్యక్తి చెప్పాడు. భోగవాంఛ ఇంగ్లాండు సమాజాన్ని ముంచివేస్తున్నది. అభివృద్ధి చెందిన దేశం, అంటే గొప్ప ధనిక దేశం అనబడే ఇంగ్లాండు పరిస్థితే ఇంత హీనంగా వుంటే భోగవాద, వ్యక్తినిష్ఠ ప్రధానమైన వాళ్ల సంస్కృతిని అనుకరించటానికి పూనుకునే కొన్ని ఇతర దేశాల పరిస్థితి ఎలా వుంటుందో మనం ఆలోచించాలి. ఇలాంటి దేశాలు ఈనాడు ప్రపంచంలో 90% కంటే ఎక్కువ వున్నాయి.

## మార్గదర్శనం కోసం ఎదురు పాశ్చాత్యదేశాలు

తమ సామాజిక జీవనానికి వ్యక్తి నిష్ఠ, భోగవాద సంస్కృతిని ఆధారంగా గ్రహించిన పాశ్చాత్య, ఇంకాకొన్ని ఇతర దేశాలు పతనోన్ముఖంగా దారి తప్పి నడుస్తున్నాయి. ఇష్టం వచ్చినట్లు ప్రకృతి వనరులను పిండుకుంటూ, ప్రకృతి సంతులనాన్నికూడా వాళ్ళు పాడుచేస్తున్నారు. పర్యావరణానికి సంబంధించి వాళ్ళు సృష్టించిన భయంకర సమస్యల కారణంగా ప్రాణికోటి ఉనికికే పెద్ద ప్రమాదం ఏర్పడుతున్నది. తమ భోగవాసన కారణంగా ఆ సమాజాలు స్వయంగా పతనమై పోవటమేకాక ఇంకా అనేక మందికి కూడా ఇదేగతి కలిగేట్లు

చేస్తున్నాయి. పాశ్చాత్య ఆలోచనా విధానం కారణంగా ప్రపంచానికి ఆపదముంచుకొస్తున్నది. ఈ ఆపదనుండి దాన్నెవరు రక్షిస్తారు?

ఈ ఆపదనుండి విముక్తి పొందటానికి పాశ్చాత్య మేధావుల దృష్టి ఈనాడు భారతదేశంవైపు మళ్ళింది. పాశ్చాత్య ఆలోచనాపద్ధతిని అవలంబించే ఈనాటి భారతీయ వ్యక్తులుకూడా తమకంటే ఎక్కువగా మానసిక సుఖశాంతులు పొందుతూ వుంటడటం చూసి పాశ్చాత్య దేశాలకు చెందిన కోటీశ్వరుల పిల్లలు భారతదేశంవైపు ఆకర్షితులవుతున్నారు. ఇందులో కూడా వాళ్ల వ్యక్తినిష్ఠ ఆలోచనే పనిచేస్తున్నది. వ్యక్తిగతంగా వాళ్ళకు మానసిక సుఖ శాంతులు కావాలి: అందుకోసం వాళ్ళలో కొందరు కృష్ణకాన్షస్ సంస్థలో చేరుతుంటే కొందరు మహేష్‌యోగికి శిష్యులవుతున్నారు. వ్యక్తి నిష్ఠపై ఆధారపడినవాళ్ళ ఈ ప్రయత్నాలు వ్యక్తికి మనశ్శాంతిని ప్రసాదించటంలో ఎంతవరకు విజయం సాధిస్తాయో వేచిచూడాలి.

కాని ఈనాడు వాళ్ళు భారతదేశ మార్గదర్శనం కోరుతున్నారని మాత్రం గట్టిగా చెప్పవచ్చు. పాశ్చాత్య ఆలోచనా పద్ధతిని అనుసరించే ఇతర సమాజాలు కూడా తమ సమాజాలు పతనోన్ముఖమైపోతున్నాయని తెలుసుకున్న పక్షంలో మార్గదర్శనంకోసం అవికూడా భారత దేశంవైపు చూడటం మొదలుపెట్టాయి.

భారతీయులు నడుంబిగించాల్సిన అవసరం ఏర్పడింది. ప్రపంచం ఆపదలో వున్న కారణంగా ఇతరదేశాలకు ఈనాడు భారతదేశం పెద్ద ఆశాకేంద్రమైంది. మేధావులు, ప్రగతి శీలురనైన పాశ్చాత్యులు భారతదేశం నుండి మార్గదర్శనం కోరుతున్నారు. అంటే మార్గదర్శనానికవసరమైన శక్తి సామర్థ్యాలు, గుణాలు భారతదేశానికున్నాయని వాళ్ళకనిపిస్తున్న దన్నమాట. నందరెండువందల సంవత్సరాలకు పూర్వం పాశ్చాత్యులు, భారతీయులు హీనులని, తాము శ్రేష్ఠులమని భావించేవాళ్ళు చాలా మంది భారతీయులు కూడా పాశ్చాత్యులే తమ కంటే శ్రేష్ఠులని, తాము వాళ్లకంటే అధములమని

అనుకునేవాళ్లు. తమ శ్రేష్ఠత్వం కేవలం ఐహిక సుఖాలవరక పరిమితమైందని, ప్రజలందరికి మానసిక సుఖశాంతులను ప్రసాదించగల కుటుంబసామాజిక వ్యవస్థల విషయంలో వాళ్ళు హీనులని ఇప్పుడు పాశ్చాత్యులు తెలుసుకున్నారు. ఈ విధంగా ఇప్పుడు కాలం మారిపోయింది. భారతీయులు తమలో ఏర్పడిన న్యూనతాభావాన్ని తొలగించుకోవాల్సిన అవసరం ఈనాడెంతైనా వుంది. పాశ్చాత్యులతో సంపర్కం లేక ముందు భారతీయులు ఒక జాతి, సుసంస్కృతులు విద్యావంతులు మొదలైన గుణాలు కలవారు కాదనే భావం పూర్తిగా అబద్ధం. అది కేవలం పాశ్చాత్యుల స్వార్థపూరిత ప్రచారం మాత్రమే. ఈవాస్తవాన్ని స్వయంగా పాశ్చాత్య మేధావులే ఇప్పుడు చెబుతున్నారు. భారతదేశంమీద ఆర్యుల దురాక్రమణ కపోల కల్పితమని వాళ్లిప్పుడంటున్నారు. భారతజాతి వేదకాలం నుండి కొనసాగుతూ వస్తున్నది. ప్రతి వ్యక్తికీ మానసిక సంస్కారం కలిగించే వ్యవస్థ, కుటుంబవ్యవస్థ, వేదకాలం నుండి చక్కని పద్ధతిలో కొనసాగుతూ వచ్చాయి. 90% కంటే ఎక్కువమంది ప్రజలు విద్యావంతులై వుండేవాళ్ళు. అనేక కళలు, శాస్త్రాల్లో వాళ్లకు ప్రాముఖ్యత వుండేది. ఐహిక సంపదల విషయంలో కూడా వాళ్లకేవిధమైన లోటువుండేదికాదు. ఎవరూ అనాథలుగా, అన్నార్తులుగా వుండకూడదని వాళ్ళు భావించారు. ఇదే నిజమైన మన జాతి చరిత్ర. ఈవాస్తవాన్ని మనం సరిగా అర్థం చేసుకొని ఆపదలోవున్న ప్రపంచానికి మార్గదర్శనం చేయటానికి సిద్ధంకావాలి. పాశ్చాత్య మేధావులు, ఈపనిని భారతీయులే చేయగలరనే ఆశతో వున్నారు. ఉత్తమ సంస్కృతి అందరికంటే ఎక్కువ సుదీర్ఘ సామాజిక జీవనం కలిగిన భారతదేశం ఒక్కటే ఈపని చేయగల్గుతుంది. ఇంకెవరు చేయలేరు. సంస్కారమిచ్చే కుటుంబాలు కావాలి.

## పాశ్చాత్యుల ఆలోచన

తమ కుటుంబాలు సంస్కారమిచ్చే సామర్థ్యం కలవి కావాలనే

కీడు జరగకూడదనే భావంతో మెలుగుతుంటారు. ఈ విధమైన భావనయే వ్యక్తిని ఉత్తమ సంస్కారాలతో తీర్చిదిద్దుతుంది. ఈనాడు పాశ్చాత్య వ్యామోహ ప్రభావంతో మన కుటుంబ వ్యవస్థ కొంతవరకు శిధిలమైనా పైన పేర్కొనబడిన కారణంగా మన దగ్గర వృద్ధులు, వికలాంగులు, నిరుద్యోగులు ఇలాంటి కుటుంబ ఘటకుల సంఖ్య ఎక్కువ ప్రమాణంలో అనాధులుగా లేరు. పాశ్చాత్య దేశాల్లో వలె ప్రభుత్వంమీద, వీళ్ళ భారం పడకుండా అనేక కుటుంబాలమీద అది విభజితమై పోయింది.

## భారతీయ కుటుంబ వ్యవస్థ ఉత్తమోత్తమం

కుటుంబంలో సభ్యులందరు మానసికంగా సుఖశాంతులు కలిగి వున్నప్పుడు వ్యక్తి మొదలుగొని మొత్తం మానవ సమాజం సుఖ సంతోషాలతో తులతూగుతుందన్న విషయం సైద్ధాంతికంగా ఆలోచిస్తే, చాలా సులభమనే అనిపిస్తుంది, కాని ఈ నాటి పరిస్థితుల్లో దాన్ని ఆచరణలోకి తేవటం సాధ్యపడుతుందా అనే అనుమానం చాలామందికి కలుగుతుంది. కుటుంబవృత్తులు అడుగంటిపోయి ఇప్పుడు పరిశ్రమలు పెరిగి పోయాయి. ఒకే కుటుంబానికి చెందిన వ్యక్తులు అనేక చోట్లకు వెళ్ళటం అక్కడ వేరువేరుగా కుటుంబ ఖర్చులు పెరగటం జరుగుతున్నది. జీవన వ్యయం కూడా బాగా పెరిగిపోయింది. ఎక్కువ ఖర్చుచేయడం, అప్పులు చేసి ఖర్చుచేయటం ప్రజలకు అలవాటైంది. కుటుంబం నడపాలంటే ఈ విషయాలన్ని దృష్టిలోకి వస్తాయి. ఇది నిజమే. కాని ఇలాంటి ఇబ్బందులు కారణంగా పూర్వంవలె ఈనాడు పెద్దకుటుంబాలు నడపటం సాధ్యంకాదనటం ఉచితం కాదు. భారతీయుల విశాలకుటుంబాలు సుదీర్ఘకాలం కొనసాగటానికి ఆర్థిక సుస్థిరత ఎప్పుడు ఆధారం కాలేదు. భారతీయుల సుదీర్ఘ సామాజిక జీవనంలో వాళ్ల ఆర్థిక స్థితిగతులు అనేక కారణాలవల్ల రకరకాల మార్పులు చెందుతూ వచ్చాయి. అయినా కుటుంబాలు కొనసాగటానికి కారణం వాళ్లలో నిర్మాణమైవున్న

మానసిక సంస్కారం, ఇతరుల మేలుకోసం స్వంతలాభాన్ని లెక్కచేయకూడదన సంస్కారం ప్రతివ్యక్తిలో సుధృఢంగా వున్నట్లయితే మార్పుచెందిన ఈనాటి ఆర్థిక, సామాజిక క్లిష్ట పరిస్థితుల్లో కూడా విశాల కుటుంబాలు కొనసాగించటానికి ఉపాయం దొరుకుతుంది. అనేక సమయాల్లో అవసరమొచ్చినప్పుడు భారతీయులు మౌలిక సిద్ధాంతాలను మార్చకుండ ఆచరణ పద్ధతుల్లో మార్పులు చేస్తూ ఇలాంటి ఉపాయాలు కనుగొన్నారు. అలాచేయడం ఇతరులకంటె భారతీయులకే సులభంగా సాధ్యమవుతుంది.

భారతదేశంలో కుటుంబ వ్యవస్థ వేల సంవత్సరాలనుండి కొనసాగుతూ వస్తున్నది. ఈ వ్యవస్థ కొనసాగటం, కొనసాగించబడడం, వీటిల్లో వుండే మంచి చెడుల అనుభవం భారతీయులకుంది. అందువల్ల ఈ పని భారతీయులు చక్కగా చేయగలరు. పాశ్చాత్యానుకరణంవల్ల అనేక దేశాల్లో కుటుంబ వాతావరణం చెడిపోయింది. భారతీయ కుటుంబాల్లో వచ్చిన చెడును వాళ్లల్లో వుండే సంస్కారం కారణంగా తేలికగానే సరిదిద్దుకోవచ్చు. వాళ్ల సంస్కృతి, సంస్కారాలు సుదీర్ఘకాలంనుంచి వాళ్లలో నెలకొని వుండడం వల్ల అవి చాలా ధృఢంగా వున్నాయి. కుటుంబంపట్ల ఆత్మీయత వున్న కారణంగా నా కుటుంబం ఉత్తమంగా ఉండాలనే కోరికగల వ్యక్తులు ప్రతి కుటుంబంలో వున్నారు. వ్యక్తిగత స్వార్థం కోసం, హక్కులకోసం తగువు పెట్టుకోకుండా ఇతరుల మేలుకోసం కర్తవ్యభావంతో పనిచేయాలనే వాతావరణం ఈనాడు కొంతవరకు సన్నగిల్లింది. కుటుంబం పట్ల ఆత్మీయభావం కలిగి దానిమేలు కోరే వ్యక్తులు పరస్పరం కలిసి కూర్చుని ఆలోచించి చెడిపోయిన కుటుంబ వాతావరణాన్ని చక్కదిద్దే అవకాశం వుంది. ఇతరుల మేలుకోసం కర్తవ్యబుద్ధితో పనిచేసే వాళ్ల సంఖ్య కుటుంబాల్లో ఎంతఎక్కువగా పెరిగితే అంత ఎక్కువగా భారతదేశం శక్తివంతమవుతుంది. భారత దేశం శక్తివంతం కావటానికి నేను కుటుంబసభ్యులకు సంస్కారమివ్వటం లాంటి చిన్న పని చేయాలని, కుటుంబంలాంటి చిన్న కేంద్రంలో ఈ పనిని నేనెంతో సమర్థవంతంగా చేయగలను, చేస్తాను అని ప్రతి వ్యక్తి ఈనాడు ధృఢ

నిర్ణయం తీసుకున్నప్పుడే సాంస్కృతిక సంక్షోభంతో ఆపదలో మునిగివున్న ప్రపంచ జాతులుకూడా విముక్తి చెందగలుగుతాయి. ఈ పని తప్పకుండా జరుగుతుంది.

## విదేశీ జిజ్ఞాసువుల కోరిక నెరవేరుతుంది

మొత్తం సృష్టి కార్యక్రమాలు సక్రమంగా నడవడానికి మౌలికంగా సృష్టిని గురించి చేసిన అధ్యయనం ప్రకారం మానవులందరికి లభించాల్సిన సంస్కారాలు ఎలా వుండాలో ప్రాచీన భారతీయులు నిర్ణయించి దాని ప్రకారం మన జాతిని సుసంపన్నం చేశారు. ఇలాంటి సంస్కారవంతులైన వ్యక్తులుగల అనేక భారతీయకుటుంబాలను భారతీయుల ద్వారా మార్గదర్శనం కోరుతున్న విదేశీయులు చూసినప్పుడు, అవసరమనుకుంటే ఆ కుటుంబాల్లో స్వయంగా నివసించినప్పుడు, ప్రత్యక్ష్య నిదర్శనం కనబడుతున్న కారణంగా వాళ్లు తప్పక చక్కని మార్గదర్శనాన్ని పొందగలుగుతారు. దానితో పాటే భారతీయ తత్త్వజ్ఞాన, సంస్కృతుల పరిచయం కూడ వాళ్లకు లభిస్తుంది. భారతీయుల సౌహార్ద్ర పూర్ణ వ్యవహారం ఏ తత్త్వజ్ఞానం ఆధారంగా నిర్మాణమైందో ఆ తత్త్వజ్ఞానులకు మాత్రమే తెలుసని కాదు. భారతీయులు మొదటినుండి మంచి వ్యవహారజ్ఞానం కలవాళ్లు. అందువల్ల ప్రతిఒక్క భారతీయుడు అది తత్త్వ జ్ఞానం అనుసరించే తన జీవితాన్ని గడుపుతుంటాడు. బిచ్చమెత్తుకునే భారతీయుడు కూడానువ్వెందుకు బిచ్చమెత్తుకుంటున్నావని అడిగితే ''నా పూర్వ జన్మకర్మ'' అని ఠక్కున సమాధానం ఇస్తాడు. విదేశీ జిజ్ఞాసువులు ఇలాంటి సామాన్య భారతీయుడినుండి కూడా భారతీయ కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలగురించి తెలుసుకునే అవకాశం ఉంది. ఈ విధంగా తత్త్వజ్ఞానం, ఆచరణ ఈ రెండు విషయాలు వాళ్లకు సామాన్య భారతీయులద్వారానే తెలుస్తాయి.

## కృణ్వంతో విశ్వమార్యమ్

మితిలేని భోగవాద ఆచార, వ్యవహారాల కారణంగా ప్రపంచానికీవిధమైన ప్రమాదం ఏర్పడడం భారతీయుల దృష్టిలో అదృష్టమనే చెప్పాలి. మొదటినుడి భారతీయులు ప్రతి వ్యక్తిలో సంస్కారం నిర్మాణం చేస్తూ సంపూర్ణ మానవ సమాజంలో సంస్కార నిర్మాణం జరపడం తమ లక్ష్యంగా పెట్టుకున్నారు. అంటే సంపూర్ణ మానవ సమాజం వాళ్ల కార్యక్షేత్రంగా వుండేది. విశ్వజనీన నియమానుసారం మానవుడు తన కర్తవ్యాన్ని, లేక ధర్మాన్ని తప్పక ఆచరించాలి. ఈ కర్తవ్యాన్ని లేక ధర్మాన్నే మానవ ధర్మం లేక సనాతన ధర్మమని వాళ్లన్నారు. ఈ కర్తవ్యాన్ని వాళ్లు సంపూర్ణమానవ సమాజానికి తెలియజేయాలనుకున్నారు. ఈ మానవ ధర్మాన్ని ఆచరించే భారతీయులను భారతీయేతరులు హిందువులని పిలిచేవాళ్లు. క్రీ.శ. 8 వ శతాబ్దం వరకు భారతీయులు ఆ పేరును ఉపయోగించలేదు. ఆ సమయంలోనే మొదటిసారిగా మహ్మదీయులద్వారా భారతదేశంలో బలవంతంగా మత ఛాందసవాదం ప్రారంభించబడింది. భారతీయులకు అదొక కొత్త అనుభవం. దాన్ని వాళ్లు చాలా నీచమైనదిగా భావించారు. అప్పుడు వాళ్లకొక సమస్య ఎదురైంది. బలవంతంగా మతం మార్చే వాళ్ల పేరు మహ్మదీయులు కాబట్టి మతం మార్చబడిన మార్చబడని వివిధ సాంప్రదాయాల (శైవ,వైష్ణవ, బౌద్ధ, జైన మొ.) వాళ్లకు ఏదో ఒక పేరు పెట్టాల్సిన అవసరం ఏర్పడింది. అప్పుడు మానవ ధర్మావలంబులైన భారతీయులు, మహ్మదీయులకు తమకు మధ్య ఉండే భేదం తెలియజేయడానికి తమను హిందువులని పిల్చుకోవటం మొదలు పెట్టారు. ఈ పేరు అప్పటికి రెండున్నర వేల సంవత్సరాలకు పూర్వమే భారతీయేతరులచే భారతీయులకు పెట్టబడి వుండింది. వాస్తవంలో హిందూ ధర్మం అన్నది మానవ ధర్మమే. మానవ ధర్మం, సనాతన ధర్మం ఈ రెండు పదాల ప్రయోగం 8 వ శతాబ్దం కంటే ముందువేలాది సంవత్సరాలనుండి వాడుకలో వున్నాయి. ఈనాటికి అది తగివుంది.

సంపూర్ణ మానవ సమాజమే భారతీయుల కార్యక్షేత్రం. కాబట్టి "కృణ్వంతో విశ్వమార్యం" అన్నది వాళ్ల నినాదమైంది. ఈ కారణంగా ప్రపంచమానవులందరి దగ్గరికి వెళ్లి వాళ్లు ఈ మానవ ధర్మాన్ని వాళ్లకు బోధిస్తూ వచ్చారు.

ఈనాడు ఆపదలో వున్న ప్రపంచ ప్రజలు చాలమంది భారతీయులనుండి ఆ మానవధర్మాన్ని తెలుసుకోవాలని, గ్రహించాలని కోరుతున్నారు. భారతీయులకు జిజ్ఞాసులైన శిష్యులు లభించారు. ఇది వాళ్ల అదృష్టం. ఈ అవకాశాన్ని సద్వినియోగపర్చుకొని భారతీయులు తమ మానవ శ్రేయోలక్ష్యాన్ని చేరుకోవటానికి కృషి చేయాలి.

# సూతపరంపర కోసం మహిళల అవసరం

భారతీయ సంస్కృతీ జ్ఞానాన్ని పరిపూర్ణంగా తెలుసుకుని, దాన్ని ప్రచారం చేయడంకోసం తమ మొత్తం జీవితాన్ని సమర్పించిన సూతుల (సంస్కృతీ ప్రచారకుల) పరంపర వైదిక కాలంకంటే ప్రాచీనమైంది. వీరిని పురాణాలలో 'విచిత్ర కథనా జీవాః' అని చెప్పబడింది. వి + చిత్ = విషయమంతా తెలుసుకోవడమేగాక అనేక రకాలైన ఆకర్షణా పద్ధతులతో సర్వసాధారణ ప్రజలకుకూడా అర్థమయ్యేట్లు చెప్పడం, సమాజంలోని చిట్టచివరి వ్యక్తివరకు సంస్కృతి - సత్యంలను తీసుకువెళ్లే లక్ష్యంతో అవిశ్రాంతంగా ప్రయత్నించేవాళ్లు ఈ వర్గానికి చెందినవారు.

నేడు ప్రపంచమంతటా మహిళలు తమ హక్కులకోసం పోరాడటానికి సంఘటితమవుతున్నారు. కొంతమేరకు అందులో వాళ్ళు విజయం సాధిస్తున్నారు. పాశ్చాత్య మహిళ వారికి వ్యక్తిగతంగా ఆదర్శంగా నిలుస్తోంది. మహిళా జాగరణ అనే ఈ సంక్రాంతి వేళ చిరంతనమైన భారతీయ సమాజ వ్యవస్థకు చెందిన మౌలిక సిద్ధాంతాల జ్ఞానం ద్వారా వారిమార్గం మరింత ప్రశస్తి పొందుతుంది.

భారతీయ సూత పరంపరకు చెందిన సుదీర్ఘ చరిత్రలో మహిళా సూతుల సంఖ్య ఎప్పుడూ అధికంగానే ఉంది. మారుతున్న ప్రపంచ పరిస్థితుల్లో భారతీయ మౌలిక సిద్ధాంతాల ప్రచారంకోసం మహిళా సూతులు అవసరమైన సంఖ్యలో ముందుకు రావాలనే విషయం మహిళలు అర్థం చేసుకోవాలి. భారతీయ సంస్కృతి అనే అమృతాన్ని సేవించి విశ్వమంతటా ఒక సాత్త్విక సుఖమయ సృష్టిని భారతీయ స్త్రీ సృష్టించాల్సి ఉంది. మనం మన సంస్కృతి గురించి తెలుసుకుని, అర్థం చేసుకుని, మననం, చింతనం, ఆచరణం ద్వారా ఆ సత్యాన్ని సమస్త ప్రపంచానికి అందించాలి.

# సేవికా ప్రకాశన్ ఆంధ్ర ప్రాంత ద్వారా ప్రచురితమైన పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | రాష్ట్రీయ సేవికా సమితి (సంక్షిప్త పరిచయం) | రూ. 6.00 |
| 2. | మనదేశపు ఎల్లలు - నిన్న, నేడు, రేపు | |
| 3. | మాతృత్వము | రూ. 3.00 |
| 4. | కర్తృత్వము - నేతృత్వము | రూ. 3.00 |
| 5. | రాష్ట్రనాథ్ | రూ. 2.00 |
| 6. | శ్లోకస్తోత్ర రత్నావళి | రూ.3.50 |
| 7. | ఆచార పద్ధతి | రూ.1.00 |
| 8. | స్త్రీ జీవన సఫలత | రూ. 1.00 |
| 9. | వందనీయ మౌసీజీ | రూ. 10.00 |
| 10. | శక్తి - కేంద్రము | రూ. 5.00 |
| 11. | భగవాధ్వజము | రూ. 5.00 |
| 12. | సోదరి నివేదిత | రూ. 2.00 |
| 13. | ప్రాతః స్మరణీయ మహిళలు | రూ. 3.00 |
| 14. | దేశ సమస్యలు | రూ. 1.50 |
| 15. | వందేమాతరం గాథ | రూ. 5.00 |
| 16. | కర్మయోగిని సరస్వతీ బాయి ఆప్టే. | రూ. 8.00 |
| 17. | కర్మయోగిని అహల్యాబాయి | రూ. 7.00 |
| 18. | चिरंतन भारतीय संस्कृति के आधार | రూ. 7.00 |

# సూతపరంపర కోసం మహిళల అవసరం

భారతీయ సంస్కృతీ జ్ఞానాన్ని పరిపూర్ణంగా తెలుసుకుని, దాన్ని ప్రచారం చేయడంకోసం తమ మొత్తం జీవితాన్ని సమర్పించిన సూతుల (సంస్కృతీ ప్రచారకుల) పరంపర వైదిక కాలంకంటే ప్రాచీనమైంది. వీరిని పురాణాలలో 'విచిత్ర కథనా జీవాః' అని చెప్పబడింది. వి + చిత్ = విషయమంతా తెలుసుకోవడమేగాక అనేక రకాలైన ఆకర్షణా పద్ధతులతో సర్వసాధారణ ప్రజలకుకూడా అర్థమయ్యేట్లు చెప్పడం, సమాజంలోని చిట్టచివరి వ్యక్తివరకు సంస్కృతి - సత్యంలను తీసుకువెళ్లే లక్ష్యంతో అవిశ్రాంతంగా ప్రయత్నించేవాళ్లు ఈ వర్గానికి చెందినవారు.

నేడు ప్రపంచమంతటా మహిళలు తమ హక్కులకోసం పోరాడటానికి సంఘటితమవుతున్నారు. కొంతమేరకు అందులో వాళ్ళు విజయం సాధిస్తున్నారు. పాశ్చాత్య మహిళ వారికి వ్యక్తిగతంగా ఆదర్శంగా నిలుస్తోంది. మహిళా జాగరణ అనే ఈ సంక్రాంతి వేళ చిరంతనమైన భారతీయ సమాజ వ్యవస్థకు చెందిన మౌలిక సిద్ధాంతాల జ్ఞానం ద్వారా వారిమార్గం మరింత ప్రశస్తి పొందుతుంది.

భారతీయ సూత పరంపరకు చెందిన సుదీర్ఘ చరిత్రలో మహిళా సూతుల సంఖ్య ఎప్పుడూ అధికంగానే ఉంది. మారుతున్న ప్రపంచ పరిస్థితుల్లో భారతీయ మౌలిక సిద్ధాంతాల ప్రచారంకోసం మహిళా సూతులు అవసరమైన సంఖ్యలో ముందుకు రావాలనే విషయం మహిళలు అర్థం చేసుకోవాలి. భారతీయ సంస్కృతి అనే అమృతాన్ని సేవించి విశ్వమంతటా ఒక సాత్త్విక సుఖమయ సృష్టిని భారతీయ స్త్రీ సృష్టించాల్సి ఉంది. మనం మన సంస్కృతి గురించి తెలుసుకుని, అర్థం చేసుకుని, మననం, చింతనం, ఆచరణం ద్వారా ఆ సత్యాన్ని సమస్త ప్రపంచానికి అందించాలి.